# సీతాపహరణము



మారుతీ గ్రంథమండలి

ఉరవకొండ

కే. వి. సుబ్బారావుగారి

యితర గ్రంథములు



తెలుగు:

1. కవిత (ఛందస్సు)

2. 'మిత్రనీతి శతకము

ఇంగ్లీషు:

**My Humble Bit**

(IN ENGLISH VERSE)

మారుతీ గ్రంథ మండలి : 2

సంపాదకుడు :—యు. గోవిందాచార్యులు

# సీతాపహరణము

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త :

డాక్టరు, కోట - వేంకటసుబ్బారావు, ఎల్. యం. పి.

ప్రకాశకులు :

మారుతీ గ్రంథమండలి, ఉరవకొండ

(అనంతపురము జిల్లా)



| | |
|---|---|
| చందాదారులకు | 0- 8-0 |
| ఇతరులకు | 0-10-0 |

ద్వితీయ ముద్రణము : 1500 ప్రతులు

చెన్నపురి

ఆనంద ముద్రణాలయమున ముద్రితము

1936

శ్రీరస్తు

## రాజపోషకులు

| | | | |
|---|---|---|---|
| 1. | మ. రా. శ్రీ | మిడగల - చిన్నబసప్పగారు | ఉరవకొండ |
| 2. | ,, | గుత్తము - వేంకటరామణప్పగారు | ,, |
| 3. | ,, | చీకలగురికి - గుర్రాయప్ప కె. రామరావుగారు | చీకలగురికి |
| 4. | ,, | పాటీలు [illegible]రెడ్డిగారు | హావళిగి |

## పోషకులు

| | | | |
|---|---|---|---|
| 1. | మ. రా. శ్రీ | మిడగల - [illegible]యప్ప అండ్ సన్స్ | ఉరవకొండ |
| 2. | ,, | మిడగల - నారాయణప్పగారు | తిమ్మనచర్ల |
| 3. | ,, | మావినమడుగు - [illegible]దయ్యగారు | లత్తవరము |
| 4. | ,, | కరణము - వేంకటదాసప్పగారు | చీకలగురికి |
| 5. | ,, | పాటీలు - కేశవరెడ్డిగారు | రామపురము |
| 6. | ,, | మల్లికార్జునప్ప, బసలింగప్ప మాంశే దేశాయిగారు | గడేహోతూరు |

## అభిమానులు

| | | | |
|---|---|---|---|
| 1. | మ. రా. శ్రీ | బుశెట్టి - హొన్నప్ప శ్రేష్ఠిగారు | ఉరవకొండ |
| 2. | ,, | పాళము - ఎర్రప్పగారు | ,, |
| 3. | ,, | యల్ - భగవాన్‌దాసుగారు | ,, |
| 4. | ,, | కల్లూరు - గిరియప్పగారు | ,, |
| 5. | ,, | ఎత్తిసెట్టి - వీరప్పగారు | ,, |
| 6. | ,, | కె. వెంకోబరావుగారు | తిమ్మనచర్ల |
| 7. | ,, | పి. తిమ్మారెడ్డిగారు | గుంతకల్లు |

| | | | |
|---|---|---|---|
| 8. | మ. రా. శ్రీ | మేటి - విరుపన్న గౌడుగారు | బూదగవి |
| 9. | ,, | కరణము - వాసుదేవరావుగారు | పాశిలి |
| 10. | ,, | దేశాయి - హొన్నప్పగారు | విడపనకల్లు |
| 11. | ,, | కల్లుమఠము - వీరయ్య అండ్ బ్రదర్ | ,, |
| 12. | ,, | పా. చిన్నరామప్పగారు | రేణిమాకులపల్లె |
| 13. | ,, | కె. శేషగిరిరావుగారు | వ్యాసాపురము |
| 14. | ,, | పా. విరూపాక్షగౌడుగారు | లత్తవరము |
| 15. | ,, | గడుపూటి - గోవిందప్పగారు | గడేహోతూరు |
| 16. | ,, | ఎ. శివానందముగారు | ,, |
| 17. | ,, | పి. నారాయణరెడ్డిగారు | ,, |
| 18. | ,, | పలకలదిన్నె - నాగిరెడ్డిగారు | వజ్రకరూరు |
| 19. | ,, | ఎ. వేంకటరామప్పగారు | అమిదాల |

## చందాదారులు

| | | | |
|---|---|---|---|
| 1. | మ. రా. శ్రీ | కొంకేటి - సుబ్బయ్యగారు | ఉరవకొండ |
| 2. | ,, | పల్లపాటి - హీరాచారిగారు | ,, |
| 3. | ,, | యం. ఖలందర్ హుసేన్ సాహేబు | ,, |
| 4. | ,, | యస్. కృష్ణమూర్తిగారు | ,, |
| 5. | ,, | కొట్రె - మల్లప్ప, సంగమప్పగార్లు | ,, |
| 6. | ,, | బి. యన్. సోమయ్యగారు, బి.ఏ., బి.ఇడి.. | ,, |
| 7. | ,, | పిండికూర - ఎర్రెప్పగారు | ,, |
| 8. | ,, | ఎద్దుల - కరిబసప్ప, నాగప్పగార్లు | ,, |
| 9. | ,, | మిడదల - చిన్నకరిబసప్పగారు | ,, |
| 10. | ,, | ముక్తాపురము - వీరప్పగారు | ,, |
| 11. | ,, | యం. ఆర్. కరిబసప్పగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 12. | మ. రా. శ్రీ | చంద్ర - బండెప్పగారు | ఉరవకొండ |
| 13. | ,, | కమసల - వీరాచారిగారు | ,, |
| 14. | ,, | ఆర్. రంగప్పగారు | ,, |
| 15. | ,, | బాలవిద్యార్థి గ్రంథాలయము | ,, |
| 16. | ,, | క్రొత్తపల్లి - బ్రహ్మయ్యాచారిగారు | ,, |
| 17. | ,, | డి. రంగప్పగారు | ,, |
| 18. | ,, | పండా - భీమప్పగారు | ,, |
| 19. | ,, | పి. సుబ్బయ్య నాయుడు గారు | ,, |
| 20. | ,, | యస్. మహమ్మద్ ఆదంసాహేబ్ | ,, |
| 21. | ,, | యస్. కేశవరావుగారు | ,, |
| 22. | ,, | కరూరు - పెద్దసంజీవప్పగారు | ,, |
| 23. | ,, | కణేకల్లు - హొన్నూరు సాహెబ్ | ,, |
| 24. | ,, | హొన్నూరు - బంగీసాహెబ్ | ,, |
| 25. | ,, | పి. వీరరాఘవయ్యగారు | ,, |
| 26. | ,, | వి. బండెయ్యగారు | ,, |
| 27. | ,, | టి. గోపాలరావుగారు | ,, |
| 28. | ,, | కె. యస్. రామమూర్తిగారు | ,, |
| 29. | ,, | పి. రామలింగప్పగారు | ,, |
| 30. | ,, | కొత్త - చిన్నయ్యగారు | ,, |
| 31. | ,, | ఎ. నారాయణస్వామిగారు | ,, |
| 32. | ,, | గట్టు - హనుమప్పగారు | ,, |
| 33. | ,, | ఇటిగాని - సెట్టికల్లప్పగారు | ,, |
| 34. | ,, | చింతా - నారాయణప్ప అండ్ కో | ,, |
| 35. | ,, | జాటూరు - శివశంకరప్పగారు | ,, |
| 36. | ,, | వి. వి. వేంకటరమణప్పగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 37. | మ. రా. శ్రీ | ఉ. ఉరుకుందప్పగారు | ఉరవకొండ |
| 38. | ,, | యలవండి - నెట్టికల్లప్పగారు | ,, |
| 39. | ,, | ఏళ్ల - రాతింటి - రామప్పగారు | ,, |
| 40. | ,, | ఏళ్ల - తిమ్మన్నప్పగారు | ,, |
| 41. | ,, | క. నారాయణశాస్త్రిగారు | ,, |
| 42. | ,, | పి. నాగేంద్రయ్యగారు | ,, |
| 43. | ,, | జె. సంగప్పగారు | ,, |
| 44. | ,, | టి. హనుమంతప్పగారు | ,, |
| 45. | ,, | పి. కరిబసవస్వాముగారు | ,, |
| 46. | ,, | యస్. రంజుంకప్పగారు | ,, |
| 47. | ,, | జినాక్ష - రామలింగప్పగారు | ,, |
| 48. | ,, | యం. హనుమంతరావుగారు | ,, |
| 49. | ,, | నలబాల - వీరేశప్పగారు | ,, |
| 50. | ,, | కల్లూరు - హనుమంతప్పగారు | ,, |
| 51. | ,, | డి. చిదంబరయ్యగారు | ,, |
| 52. | ,, | ఏళ్ల - మల్లేశప్పగారు | ,, |
| 53. | ,, | ఆర్. లక్ష్మణరావుగారు | ,, |
| 54. | ,, | వెంకటరత్నముగారు | ,, |
| 55. | ,, | యస్. బి. కృష్ణమాచార్యులుగారు | ,, |
| 56. | ,, | క. రామరావుగారు | ,, |
| 57. | ,, | బి. ఆర్. రామమూర్తిగారు | ,, |
| 58. | ,, | యం. యల్. సుబ్బయ్య శ్రేష్ఠిగారు, బి. ఏ., బి.ఇడి. | ,, |
| 59. | ,, | టి. లక్ష్మీపతిగారు, బి. ఏ., యల్. టి. | ,, |
| 60. | ,, | క. కృష్ణప్పగారు, బి. ఏ., బి. ఇడి. | ,, |

61. మ. రా. శ్రీ ఎ. సుబ్బరాయులుగారు ఉరవకొండ
62. ,, బుశెట్టి - హాలాస్నప్ప శ్రేష్ఠిగారు తిమ్మనచర్ల
63. ,, ఇల్లూరు - వేంకటాద్రప్ప శ్రేష్ఠిగారు ,,
64. ,, యస్. నాగప్పగారు ,,
65. ,, యస్. జనార్దనరావుగారు ,,
66. ,, పత్తిసాల - సోమప్ప అండ్ బ్రదర్స్ ,,
67. ,, గూగల్లు - [illegible]ష్టప్ప, చిన్నాల వెంకట నారాయణప్పగార్లు ,,
68. ,, కె. కృష్ణారావుగారు ,,
69. ,, కె. శ్యామారావుగారు ,,
70. ,, కరిణము - రామప్పగారు చిన్నముష్టూరు
71. ,, వాసుదేవశాస్త్రిగారు ,,
72. ,, పి. [illegible]గారు ,,
73. ,, [illegible] - రామప్పగారు ,,
74. ,, కరిణము - కృష్ణారావుగారు పెద్దముష్టూరు
75. ,, యం. రామచంద్రరావుగారు ,,
76. ,, కె. హనుమంతరావుగారు గంజికుంట
77. ,, పి. రామ[illegible]గారు ,,
78. ,, కె. స్వామిరావుగారు ,,
79. ,, కురుబ - సుంకప్పగారు తట్రకల్లు
80. ,, డి. వెంకటస్వామిగారు ఆమిదాల
81. ,, యం. నారాయణాచార్యులుగారు బి. ఏ., బి. ఇడి. బళ్లారి
82. ,, ఆర్. సభాపతిరావుగారు, బి. ఏ., బి. యల్. ,,
83. ,, కె. దివాకరరావుగారు, బి. ఏ. ,,

| | | | |
|---|---|---|---|
| 84. | డి. ఎక్స్. యల్. సీర్. మోటార్ వర్క్సు | | బళ్లారి |
| 85. | మ. రా. | శ్రీ కె. నరసింహశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్. | ,, |
| 86. | ,, | టి. సుబ్రహ్మణ్యముగారు, బి. ఏ., బి. యల్. | ,, |
| 87. | ,, | సి. వేంకటసుబ్బారావుగారు, బి. ఏ. బి. యల్. | ,, |
| 88. | ,, | కె. రామచంద్రరావుగారు | కొమ్మనహాళు |
| 89. | ,, | ఆర్. కరిబసవనగౌడుగారు | బూదగవి |
| 90. | ,, | కె. శేషగిరిరావుగారు | ,, |
| 91. | ,, | నిష్ఠి - శ్రీరాములుగారు | చాబాల |
| 92. | ,, | కె. వెంకోబరావుగారు | ,, |
| 93. | ,, | కె. హనుమంతరావుగారు | ,, |
| 94. | ,, | గొల్ల - నరసప్పగారు | ,, |
| 95. | ,, | హనుమంతప్పగారు | ,, |
| 96. | ,, | సి. కె. నారాయణరావుగారు | ,, |
| 97. | ,, | ఆర్. రామలింగుగారు | ,, |
| 98. | ,, | గారశెట్టి - భద్రప్పగారు | చీకలగుర్కి |
| 99. | ,, | సిద్ధబుషి - రుద్రయ్యగారు | ,, |
| 100. | ,, | యు. కె. రామచంద్రరావుగారు | ,, |
| 101. | ,, | జె. బాలరంగప్పగారు | ధర్మపురి |
| 102. | ,, | దబ్బర - సుబ్బారాయుడుగారు | ,, |
| 103 | ,, | దబ్బర - కొండయ్య కొ. సుబ్బారాయుడుగారు | ,, |
| 104. | ,, | యం. చిదంబరప్పగారు | ,, |
| 105. | ,, | జె. హనుమంతరాయుడుగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 106. | మ. రా. శ్రీ | ఎ. శేషమరాజుగారు | ధర్మపురి |
| 107. | ,, | డి. కి. శేషప్పగారు | ,, |
| 108. | ,, | డి. చిన్నపుల్లయ్యగారు | ,, |
| 109. | ,, | వి. బాలప్పగారు | ,, |
| 110. | ,, | ఆర్. బాలిరెడ్డిగారు | ,, |
| 111. | ,, | ఎ. సుబ్రహ్మణ్యముగారు | ,, |
| 112. | ,, | జి. కి. వెంకటప్పగారు | ,, |
| 113. | ,, | గాల - [illegible] పురము రెడ్డిగారు | ,, |
| 114. | ,, | కల్లుమడి - నరసప్పగారు | ,, |
| 115. | ,, | కె. నే[illegible] రావుగారు | గడేహోతూరు |
| 116. | ,, | పి. నారాయణ రెడ్డిగారు | ,, |
| 117. | ,, | నల్లాని - చెన్నప్పగారు | ,, |
| 118. | ,, | క[illegible] - కొండయ్యగారు | ,, |
| 119. | ,, | [illegible] గారు | ,, |
| 120. | ,, | [illegible]డము - నారాయణప్పగారు | ,, |
| 121. | ,, | కడిగాల - లక్ష్మప్పగారు | ,, |
| 122. | ,, | కడిగాల - తిమ్మప్పగారు | ,, |
| 123. | ,, | నల్లప్పనాయుడుగారు | ఇంద్రావతి |
| 124. | ,, | గ. నరసింగరావుగారు | ,, |
| 125. | ,, | పి. నారాయణప్పగారు | కొట్టాలపల్లి |
| 126 | ,, | కె. కెంబసయ్యగారు | ,, |
| 127. | ,, | ఆర్. వెంకటనాయుడుగారు | ,, |
| 128. | ,, | జి. రామరాజుగారు | ,, |
| 129. | ,, | తమ్మినేని - చిన్న బాలప్పగారు | ,, |
| 130. | ,, | మరిశెట్టి - రామయ్యగారు | ,, |

131. మ. రా. శ్రీ అలమనేని - చిన్నరంగప్పగారు కొట్టాలపల్లి
132. ,, పొత్తూరు - పెద్దరంగప్పగారు ,,
133. ,, అల్లి - చిన్న యెల్లప్పగారు ,,
134. ,, సోంపల్లె - వేంకటస్వామిగారు ,,
135. ,, పొత్తూరు - పెద్దబాలయ్యగారు ,,
136. ,, బాయికాటి - బుడ్డప్పగారు ,,
137. ,, పా. నారాయణప్పగారు ,,
138. ,, నేసే - బసెట్టప్పగారు ,,
139. ,, నేసే - పెద్ద యెల్లప్పగారు ,,
140. ,, కరణము - నారాయణప్పగారు ,,
141. ,, రామింకి - పెద్దనాగప్పగారు ,,
142. ,, బాయికాటి - పెద్దన్నగారు ,,
143. ,, కాకర - పెద్ద రంగప్పగారు ,,
144. ,, కె. నరసింగరావుగారు లత్తవరము
145. ,, వెల్లగు - సంజీవప్పగారు ,,
146. ,, పాలమురు - పెద్ద బుడ్డప్పగారు ,,
147. ,, బోదపాటి - హనుమంతప్పగారు ,,
148. ,, గాజేటి - నారాయణప్పగారు, కడవలకుంట
149 ,, నూజేటి-వెంకన్న కొ. నారాయణప్పగారు ,,
150. ,, కె. వెంకటనరసప్పగారు మోపిడి
151. ,, ఆర్. గురుస్వామినాయుడుగారు ,,
152. ,, మదమంచి - ఓబళేశప్పగారు ,,
153. ,, అగడి - హనుమంతప్పగారు ,,
154. ,, యం. భీమసేనరావుగారు మాళాపురము
155. ,, యం. యస్. కృష్ణన్ గారు ,,

| | | | |
|---|---|---|---|
| 156. | మ. రా. శ్రీ | పి. చనబసవనగౌడుగారు | మాళాపురము |
| 157. | ,, | ఓరుగంటి - అయ్యప్పగారు | ఉండబండ |
| 158. | ,, | మరాఘు శాంతి వీరయ్యగారు | ,, |
| 159. | ,, | పా. బసవనగౌడుగారు | ,, |
| 160. | ,, | హెచ్. హెచ్. హనుమంతరావుగారు | హరిమెట్ల |
| 161. | ,, | కె. హాలికుంటరావుగారు | ,, |
| 162. | ,, | రాజాల - హనుమంతప్పగారు | ,, |
| 163. | ,, | రాజాల - చిన్నప్పగారు | ,, |
| 164. | ,, | వల్లి - బండెప్పగారు | ,, |
| 165. | ,, | నరసింహాచార్యగారు | హాపిరి |
| 166. | ,, | బోర్లేరి - హనుమంతప్పగారు | ,, |
| 167. | ,, | కె. మధ్వరావుగారు | ,, |
| 168. | ,, | పి. రామనగౌడుగారు | ,, |
| 169. | ,, | యస్. నారాయణప్పగారు | ,, |
| 170. | ,, | గో. కొండప్పగారు | ,, |
| 171. | ,, | బో. పెద్ద హనుమంతప్పగారు | ,, |
| 172. | ,, | సూరా - అంజనయ్యగారు | కొత్తకోట |
| 173. | ,, | తిప్పారెడ్డిగారు | హాలికి |
| 174. | ,, | గాజుల - చిన్న - నరసింహప్పగారు | ,, |
| 175. | ,, | వై. ఆంజనేయులుగారు | ,, |
| 176. | ,, | పా. తిమ్మారెడ్డిగారు | రాగులపాడు |
| 177. | ,, | పా. చి. తిమ్మారెడ్డిగారు | ,, |
| 178. | ,, | కె. నరసింగరావుగారు | ,, |
| 179. | ,, | కరూరు - నారాయణరెడ్డిగారు | ,, |
| 80. | ,, | సుబ్బారెడ్డి కొ. పాపిరెడ్డిగారు | .. |

| | | | |
|---|---|---|---|
| 181. | మ. రా. శ్రీ | యస్. జానకిరామయ్యాగారు | రాగులపాడు |
| 182. | ,, | ఈ. మల్లిరెడ్డిగారు | ,, |
| 183. | ,, | ముత్తులూరు - ఓబళేశప్పగారు | ,, |
| 184. | ,, | పా. విరుపాక్షగౌడుగారు | విడపనకల్లు |
| 185. | ,, | వలిపిరెడ్డి - నారప్ప, శంకరప్పగార్లు | ,, |
| 186. | ,, | యం. గుండాచార్లుగారు | ,, |
| 187. | ,, | కాకుంట్ల - కుమారస్వామిగారు | ,, |
| 188. | ,, | వస్లి-రుద్రప్ప, వైద్యము-బసప్పగార్లు | ,, |
| 189. | ,, | గాణిగ-శరణప్ప అండు బ్రదర్ | ,, |
| 190. | ,, | యం. కరిబసప్పగారు | ,, |
| 191. | ,, | యం. రామలింగయ్యగారు | ,, |
| 192. | ,, | యం. శరణయ్యగారు | వేల్పుమడుగు |
| 193. | ,, | కె. రామకృష్ణారావుగారు | వెలిగొండ |
| 194. | ,, | మేటి - చిన్నబసవనగౌడుగారు | ,, |
| 195. | ,, | మఠము - సిద్దయ్యగారు | ,, |
| 196. | ,, | మఠము - మాంతయ్యగారు | ,, |
| 197. | ,, | పాళేగార్-వేంకటప్ప నాయుడుగారు, | వెంకటాంపల్లి |
| 198. | ,, | కమ్మ - నారాయణప్పగారు | ,, |
| 199. | ,, | కె. వేంకటభీమారావుగారు | పాల్తూరు |
| 200. | ,, | కొంకా - హనుమంతప్పగారు | వ్యాసాపురము |
| 201. | ,, | యం. గంగయ్యగారు | ,, |
| 202. | ,, | గడిపూటి - లాలెప్పగారు | ,, |
| 203. | ,, | ఇల్లూరు - హనుమంతప్పగారు | నరిమెట్ల |
| 204. | ,, | రామలింగనగౌడుగారు | రాయంపల్లి |
| 205. | ,, | బంగారు - తిప్పన్నగారు | ,, |

| | | | |
|---|---|---|---|
| 206. | మ. రా. శ్రీ | బంగారు - రామప్పగారు | రాయంపల్లి |
| 207. | ,, | బంగారు లక్ష్మన్నగారు | ,, |
| 208. | ,, | గొంచి - హనుమంతప్పగారు | ,, |
| 209. | ,, | రెడ్డి - గోవిందప్పగారు | ,, |
| 210. | ,, | మండ్ల పూటి - లక్ష్మన్నగారు | కొట్టాలపల్లి |
| 211. | ,, | బాయికాటి - రంగప్పగారు | ,, |
| 212. | ,, | దగుపాటి - రామప్పగారు | మోటిడి |
| 213. | ,, | మేకల - వెంకటరమణప్పగారు | ,, |
| 214. | ,, | మేకల - పెదివిలప్పగారు | ,, |
| 215. | ,, | పి. లింగనగౌడుగారు | అమిదాల |
| 216. | ,, | వి. ఆర్. వెంకటాచలపతిగారు | ,, |
| 217. | ,, | కరణము - రంగరావుగారు | ,, |
| 218. | ,, | యల్. తిమ్మన్నప్పగారు | ,, |
| 219. | ,, | హెచ్. వి. నరసింగరావుగారు | ఉరవకొండ |
| 220. | ,, | వి. ఓబులేశప్పగారు | బ్రాహ్మణపల్లి |
| 221. | ,, | వి. చిన్నహనుమప్పగారు | మరుట్ల |

# విజ్ఞప్తి

మహాశయులారా !

గ్రంథమండలి స్థాపనోద్యమమును గూర్చి ప్రథమ కుసుమమగు తులసీదళమునందు విన్నవించుకొనియుంటిని. భాషాభిమానులరగు మిముబోంటి యుదారుల యౌదార్యాతిశయమున ద్వితీయకుసుమమును వెలువరించు భాగ్యమబ్బినందుల కెంతయు సంతసించితిని. నానాటఁ జందాదారుల సంఖ్యయు నెచ్చుటంజేసి, యియ్యది గ్రంథమాలాభ్యుదయమునకు భావి సూచనయని తోఁచెడిని.

శ్రీయుత కోకా - వేంకట సుబ్బారావుగారు తమ 'సీతాపహరణ' మను నైదంకముల నాటకరాజమును బ్రతిఫలరహితముగ నీ గ్రంథమండలికి ద్వితీయకుసుమముగా నర్పించినందులకు వారి కే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇందలి కథ పౌరాణికము; కథాసంవిధానము చమత్కారము; పద్యములు హృద్యములు.

ఈ గ్రంథమండలి శాశ్వతమై విలసిల్ల ననువగు నుత్సాహాది శక్తులఁ బ్రసాదింప నా పరాత్పరునిఁ బ్రార్థించెద.

ఉరవకొండ.
జనవరి-1-1936.

సంపాదకుఁడు.

# విన్నపము.

ఆర్యులారా !

సులభశైలిని నాటకంబులను వ్రాయు
కౌతుకమునఁ గాని వ్రాసితి గుణములరసి
తప్పు లెల్లను దిద్ది నన్ ధన్యుఁ జేసి
సంతసము గూర్పరే! కవిచంద్రములార !

బ్రహ్మసృష్టిని పెక్కులోపములు చూపి
బహుళవిధములఁ దర్కించు ప్రాజ్ఞులుండ
మనుజమాత్రుండ, కించిజ్ఞుఁడను, మదీయ
కవితలోఁ దప్పులను బట్టు కవులు లేరె ?

ఈ నాటకము 1923-వ సంవత్సరములో మొదటిసారి వెలువడి, పెక్కుమారులు పెక్కుచోట్లఁ బ్రదర్శింపఁబడి, యనేక మార్పులను బొందినది. ఇటీవల ఉరవకొండలోఁగూడఁ బ్రదర్శింపఁబడి పలువురచే మెప్పుఁగాంచినది. దీనిని స్వయముగఁజూచి, యానందించిన శ్రీ మారుతీ గ్రంథమండలివారు తమ ప్రచురణములలో ద్వితీయకుసుమముగాఁ గైకొందుమని కోరఁగా, దీనిని, వారి చేతులఁబెట్టి, యీ రెండవకూర్పుఁ జూచి, యానందింపఁ గలిగితిని. కావున, వారి కేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

నా యీ రెండవకూర్పును ఆమూలాగ్రముఁ దిలకించి, యనేకవిషయములందుఁ దోడ్పడిన యాంధ్రకవులును, మన్నిత్రులును నగు బ్రహ్మశ్రీ విద్యార్ణవ, సాహిత్యసరస్వతి పండిత నూతలపాటి - పేరరాజుగారి కనేక నమస్కృతులు.

ఈ నాటకము వ్రాయుటయందు నేను ముఖ్యముగఁ బాటించిన విషయము శైలి. నాటకములు ముఖ్యముగఁ బామరజన గ్రాహ్యంబు లగునట్లు మిక్కిలి సులభశైలిని వ్రాయుట ఉత్తమమని నా నమ్మకము. ఈ కథాభాగము చిన్నదైనను పెక్కు నీతులు గలయది. శృంగారమే ప్రధానముగాఁ గలయట్లు తోఁచినను వీలయినంతవఱకు నీ రసమును తగ్గించి, దుర్జాతయగు శూర్పణఖ నోటనే పెక్కు నీతులను బలికించినాఁడను. కథాక్రమమునకు భంగము గలుగనీయక, కొన్ని మార్పులు గావించినాఁడను. ఇది చదువరుల కెట్లు రుచించునో ! ఈ దినములలోఁ బ్రస్తావన అవసరముగాదు. సంధులు గొన్నియెడల విడఁదీసి వ్రాసితిని ; పద్యపాదములందు సయిత మిట్లే యొనర్చితిని. కావున, చదువరులు నన్ను మన్నింతురుగాక !

కథాక్రమము లోకవిదితము. కాని, ప్రథమాంకము మాత్రము కొంచెము క్రొత్తగాఁ దోఁచును.

ఇట్లు :
విధేయుఁడు,
కోటా - వేంకట సుబ్బారావు.

ఉరవకొండ
1-12-1935.

# అంకితము.

చిన్ననాఁటను గోరె నన్ । జేఁదీసి
నయ భయంబుల విద్దెల । నాకుఁ గఱపి
అఖిలసుఖ సంపదలఁ గూర్చి । యనవరతము
కన్న కొమరుని మాడ్కి నన్ । గాంచుచున్న
నా యనుఁగు బావ గారికి । ధీయుతునకు.

శ్రీయుత పోకల కృష్ణా
రాయనికిన్, సుగుణ ఖనికి, । ప్రవిమల మతికిన్,
ఆయత విద్యానిధికిన్,
మాయా దూరునకు, విబుధ । మండలమణికిన్.

ఆయురారోగ్య సౌభాగ్య । మతుల యశము
లొసఁగి రక్షింప నీశ్వరు । నొగి భజించి
నా రచించిన యీ చిన్న । నాటకమును
అంకితము సేయుచున్నాఁడ । నధికభక్తి.

# నాటక పాత్రలు



## పురుషులు

1. శ్రీరాముఁడు
2. లక్ష్మణుఁడు
3. రావణుఁడు
4. మారీచుఁడు
5. విరాధుఁడు
6. ఖరుఁడు
7. దూషణుఁడు
8. [illegible]వీరాక్షుఁడు
9. గంధర్వులు—ముగ్గురు
10. ఋషులు
11. అకంపనుఁడు
12. సేవకుఁడు

## స్త్రీలు

1. సీత
2. శూర్పణఖ

# నాంది

గీ. ఎవని దృక్సార కరుణార్ద్ర వృష్టిఁ దనిసి
భూనభోంతర సర్వ సంతాన సమితి
వెలయు, నా జగద్రక్షకు వీక్షణమున
వెలుగుదురుగాక మీరెల్లఁ భవ్యులార !

# సీతాపహరణము.

## ప్రథమాంకము

---

### ప్రథమ రంగము.

—●● ◆ ప్రవేశము:—విరాధుఁడు ◆ ●●—

విరాధుఁడు:—(స్వగతము) రాక్షసేశ్వరుఁడగు రావణుని యానతిచొప్పున శ్రీరాముని దెగటార్చుటకు నే నీదండకలోఁ బ్రవేశింపఁ గల్గితిని. ఇఁక నేనిందుఁ జేయవలసిన కార్యము దుర్ఘటమైనది. ఎట్టి యవినీతులును జేయరానిది.

తే. గీ. ఱేనిగూఢాజ్ఞానుసార మి • రీతి నేను
రాఁ దటస్థించె నింత దూ • రంబుగాని,
నేను జేయంగ నున్నట్టి • నీచవృత్తి
యిట్టిదని నాదు మానసం • బెఱుఁగకున్నె.

అక్కటా! పాప మారాముఁడు మా దశకంఠునకేమి కీడొనర్చెను? ఎట్టి పాపమెఱుంగని వాని నెట్లు నా చేతులారఁ జంపఁగలను? అకటా చేతులాడునా?

ఔరా! ఎట్టి చెట్టయొనర్ప సమ్మతించితిని! ఇట్టి దుస్సాధ్యకార్యమును, ఇట్టి నీచకార్యమును; ఇట్టి ఘోర

కార్యమును జేయుమన్నవాఁడు తండ్రియైనను, హితుఁడైనను గురువైనను, రాజచంద్రుఁడైనను, మఱి యెట్టివాఁడైనను ద్రోహచింతఁ దలంపక వాని నెదిర్చి, వానితోఁ బగఁగొని ఈ కార్యమును, ఈ హేయభూయిష్ఠకార్యమును, నిర్వహింపనని, నొక్కి నక్కాణింపఁ దగియున్నది. ఔరా! ఏటి కిట్లించుఁ దొడంగితిని ? పరహింసయు, పరపీడనంబును రాక్షసులకు అవశ్య మాచరణీయ కార్యములు. కావున రాముని సంహరించెదఁగాక. మఱచితిని ; అద్వితీయ బలోపేతుఁడగు మా రావణుఁడు త్రైలోక్యభయంకరుఁడు. సర్వరాజ నగరంబున కేగి వాసుకిని జయించి, తక్షకుని ప్రియభార్యను బలాత్కారంబునఁ దేగల్గెనే ! కైలాసగిరికరిగి, కుబేరునంతటివాని నోడించి వాని పుష్పకవిమానంబు నపహరించిన మహాబలుఁడే! చైత్రరథవనంబును, నందన వనంబును, తక్కుంగల ఎల్ల దేవతల యుద్యాన వనంబులను ధ్వంసము గావించి, కుబేర మహేంద్రాది సురశేఖరులను జీకాకు గావించెనే !

సీ. ఉరుఁస్థచే, శివు • హోమక్రియలఁ దన్పి,
పరమేష్ఠిచే, మహా • వరము లొందె!
కైలాసగిరి నెత్తఁ • గానోడి, శివునిచే,
అనితరలభ్య దీ • ర్ఘాయువొందె!
సాహసోత్సాహ, దోః • స్ఫార మేపారఁ గు
బేరునిఁ బురినుండి • పాఱఁద్రోలె!
ఘోరతరానేక • క్రూరకార్యములచే,
గరుడ, కిన్నర, యక్ష • పక్షుల గెలిచె!

గీ. యమ, మహేంద్రాది దేవత • లంత వారిఁ
బట్టి చిరాకుఁబెట్టి, బల్ • బట్టు పఱచె!
ఔర! అంతటి జగజెట్టి • యహా, సురారి
రామ [illegible]కయి ననుఁబంప • నేమి కతమొ?

ఇట్టి పరాక్రమశాలి తానై పూనక, నన్నేల ఈ కార్యమునకు నియమించినాఁడు? ఇది మిక్కిలి యాలోచనీయాంశము. సమస్తలోక భయంకరుండును, శూరశిఖామణియు నగు మా దశకంఠునకు మనుష్యుఁడొక్కరునిచేఁ దక్క, తక్కిన దేవ, దానవ, గంధర్వ, పిశాచ, పతంగోరగాదులవలన భయంబు లేదని వినియున్నాఁడ. ఇట్టి యవక్ర పరాక్రమశాలి ఈ కార్యమునకు నన్నుఁ బంపుటకు కారణ మేమైయుండును? ఇట్లైయుండునా? శ్రీరామ [illegible] సీతాపహరణముఁ జేయనెంచి యుండునా? ఈ నాయూహ నిక్కమైయుండును. దశకంఠునకుఁ బరస్త్రీలయం దనురాగము మెండు. నిజము; అతని యంతఃపుర కాంతల నెం[illegible] లేదు. ఆహా! ఇప్పుడు కదా మా రాక్షసేశ్వరుని కపటాభిప్రాయము నెఱుంగఁ గలిగితిని. తెలిసినది, తెలిసినది; ఈ కార్యమున ఈ చౌర్యమున, నాకేని కేమాత్రముఁ దోడ్పడరాదు. (తన దేహపటుత్వమును జూచుకొని యానందించి) ఔరా! ఈ నా దేహపటుత్వమును జూచికదా పంక్తికంధరుఁడు ప్రత్యేకముగ నన్నుఁ బంపినాఁడు. కానిమ్ము; ఆతని యాజ్ఞను శిరసావహించి, ప్రాణములపై నాసలువిడిచి, రాముని సంహరించుటకన్న, నే నే యా రాముని సీతను పరిగ్రహించి, యామెతో సుఖించెదను. రాజద్రోహియను అపవాదము పైఁబడునా? పడఁజాలదు;

ఒకవేళ ద్రోహియందురా ? అనిన నందురుగాక. లోకమున నెందఱులేరు. కుత్తుకకు తడిగుడ్డలుచుట్టి గొంతులుగోయువారి కన్నను తీసిపోయితినా ? నేను జేయునది ద్రోహమా ! కాదు. కానేరదు. సత్కార్యధురంధరుఁడగు ప్రభువునకుఁ దోడ్పడ వలెనుగాని, ఇట్టి దుష్క్రియా పరతంత్రుఁడగు రాజునకు ద్రోహినైనను ఏ మాత్రమును తప్పులేదు. మఱి యెప్పే యగును. (ఇటునటుజూచి) అదియే కాఁబోలు, రామ లక్ష్మణులు నిర్మించుకొనిన పర్ణశాల. ఈ వనమే కాఁబోలు, సీతకిపు డుద్యానవనసీమ. ఆహా ! ఈ హేమంతమునసే ఈ వన మింత మనోహరముగ నున్నదే ! ఇఁక ఇతర ఋతువులలో నెంత కన్నుల పండువుగ నుండునోకదా ! ఇదియంతయు లక్ష్మణుని యుపచారబలము గాఁబోలు. ఆహా ! అతని సోదర వాత్సల్యమెంత స్తవనీయము ! ఔరా ! అతఁడెంత నేర్పరి !

[ తెరలో:—"చెట్టు చేమ లనక, పెనుగుట్టలనక, చుట్టపక్కాలనక, ఈడు జోడు ననక" అని స్త్రీకంఠము వినఁబడును.]

(విరాధుఁ డాకర్ణించి) ఆ ! సీతకాఁబోలు. తన కష్ట సుఖములను తలంచుచు వచ్చుచున్నది. ఔను, సీతయే! (ఇటు నటు జూచి) ఇఁక నేనీ రాక్షసాకృతినిఁబాసి, శ్రీరామ వేష మునుదాల్చి, ఈ ప్రాంతములనే యెందైన నొకచో డాఁగి యుండి, సీత యొంటరిగ నుండు సమయమున ఆమెను సమీపింప చెదఁగాక !

(నిష్క్రమించును)

ప్రవేశము:—శూర్పణఖ సీతవేషమున

శూర్ప:—గీ॥ చెట్టు చేమలనక పెను • గుట్ట లనక,
చుట్ట పక్కా లనక ఈడు • జోడు ననక,
మేని సుఖమైన నరయక, • హానియనక,
మోహభరమున వచ్చితి • మూలదాఁక,
నా - కు - మారునిఁజేర సం • తసము మీర.

(స్వగత) ఆహా! మోహాముగదా నా ఈ రాకకుఁ గారణము! నా పుత్రుఁడగు జంబుకుమారునిఁ జూచుటకై లంకనుండి యింతదూరు మీ దండకారణ్యమునకు వచ్చితిని. మా చిన్నారిని చూచిన తరువాత కాలహారణము చేయక చేయవలసినపనిని జయప్రదముగ నెఱవేర్పవలెను. మొన్నటి దినమున ఆ పర్వతాగ్రముననుండి శ్రీరామునిఁ జూచితినే కాని అతనిని హతమొనర్చుటకు నా మానసము ఏ మాత్రము సమ్మతింపకున్నయది. మఱచితిని; సీతారాములు ఒండొరుల నెడఁబాయునట్లు చేయుట కష్టతరమైన కార్యము. సీత రాముని విడిచియుండదనియు, రాముఁడు సీతను బాసియుండఁడనియు, ఒకవేళ రాముఁడే ఆమెను బాసియున్న, ఆ కాలమున లక్ష్మణుఁడు సీతను గాచుచుండుననియు వినియుంటిని. ఔరా! ఎట్టి వింత! లోకమున నెందఱు భార్యలు లేరు; ఎందఱు భర్తలు లేరు. ఇంత యన్యాయమా! కన్నవారు మన్నైరా? సర్వదా మగని యొడియందే యుండవలెనా? వివాహమగువఱకు ఏమి చేసినదో; మఱి ఎందుండినదో? పాపము! ఆ జనకరాజేమి, దశరథుఁడేమి, సంతానమునకై ఏమేమో వ్రతములు సల్పిరి;

వారి భార్యలు ఎన్నెన్నో నోములు నోచిరి. పాపము! ఇందు నకా సంతానము. ఎవ్వరినిఁ జూచినను సంతానము సంతాన మనువారే. ఏటికో? నిరంతర సంతాపమును గూర్చుటకుఁ గాఁబోలు. పుట్టినవారు పుత్త్రులైన, భార్యల వలలలోఁ జిక్కి, కన్నవారి సుఖదుఃఖములను పేరుసకైన విచారింపక, తామేమో, తమ భార్యలేమో యన్నట్లు ప్రత్యేకముగ నుండి, కన్నవారిని శోకసముద్రమునఁ ద్రోయుదురు. ఇఁక పుత్త్రికలో; వివాహమైన రెండవనాఁడే మగని నెడఁబాయరు. ఎడబాయరాదఁట! ఇందునకా సంతానము. ఎవ్వ రెవ్వరిని ఉద్ధరింతురని సంతానము; కాంతుఁడు కాననాంతరమున నుండు నంతకాలము కాంతయగునది తన పుట్టినింట నుండరాదా? (ఒక శబ్దమునువిని) ఎవరో వచ్చుచున్నట్లున్నది (అని చూచి) ఇతఁడే కాఁబోలు మొన్నఁ గన్పడిన శ్రీరాముఁడు. నా యీ వేషము సీతను బోలియుండుటఁగని నేనే తన పత్నిగాఁదలంచి నాతో సరసమాడ వచ్చుచున్నాఁడు, చూచెదను. (అని పుష్పములు గోయుచుండును.)

ప్రవేశము:—రామవేషమున నున్న విరాధుఁడు

విరాధుఁడు—(స్వగత) జంకు, గొంకు లేనట్లు నే నిప్పుడు నటించెదను. (ప్రకాశ) సీతా! ఎంత సేపని నీవు పుష్పములు కోయఁగలవు? ఊరక శరీరము నేల యలయించెదవు? నేఁగోసియిచ్చెదను. (అని కోయుచుండును.)

శూర్ప—నాథా ! ఈ ప్రాంతములందుఁగల పుష్పము లన్నింటిని కోసినాను. ఇఁక ఆవలకేఁగ నా కోర్కె పండును, రండు.

విరాధు—సీతా ! పుష్పములన్న నెంత ప్రీతి నీకు ? ఇంత వఱకు లభించిన పుష్పములు చాలవా ? రమ్ము ; కుటీరమునకుఁ బోవుదము. వలయునేని నా హృదయకమలము నిచ్చెద.

శూర్ప—నాథా! ఈ పుష్పము లొక్కమాలకైనను జాలవు. ఇప్పటికిని నేఁదలంచిన పుష్పరాజము లభించనే లేదు. కావున ఇంకను గొన్నింటిని గోసివచ్చెదను. మీరు వచ్చినను, రాకున్నను నేను పోయి వచ్చెదను.

(అని పోవుచుండును.)

విరాధు—(స్వగత) ఇఁక సీతామహాలక్ష్మి నాకు నిస్సందేహముగ దొరకినది. ఏ విధముగనైనను ఈ మెను మెప్పించి, గగనమార్గమున నవలీలఁ గొనిపోయెదను.

(అని శూర్పణఖను డాయఁబోవును.)

శూర్ప—(నవ్వుట నభినయించి) నాథా ! ఆ వైకొమ్మనున్న పుష్పములను గోయవలెను. అవి నాచేతికందవు.

విరాధు—జానకి ! (ప్రయత్నించి) నాకుఁగూడఁ జిక్కనని తోఁచదు.

శూర్ప—(స్వగత) ఇతనికిఁగూడ చేతఁగాదు. కావున నా భుజముపై నెక్కి కోయుమని, భుజమెక్కిన తక్షణమే అత

నితోఁగూడ అదృశ్యనయ్యెద. (ప్రకాశముగ) అయిన నేను మీకు తోడ్పడెద. నా భుజముపై నెక్కి కోయుఁడు.

విరాధు—కాంతా! ఎంతకు సాహసించితివి! వలదు వలదు. నీవే నావీపెక్కి కోసికొనుము. (అన శూర్పణఖ వెన్నెక్కఁ బోవును.)

[అప్పుడు తెరలో]

"ఓరీ నిశాచరా! సీతాపహరణము చేసెదవా! మూర్ఖా! నీ వెవ్వఁడవు?"

శూర్ప—(దిగి, దిగ్భ్రమఁ జెందినట్లు నటించి) ఔరా! ఎంత మోసము! ఈతఁ డెవఁడు? రాక్షసుఁడఁట! (ప్రకాశముగా) అయ్యా! మీ రెవరు?

విరాధు—(కొంచెము భయముతో) సీతా! ఏమిది? నన్నెవరని ప్రశ్నించుచున్నావు! నేను నీ రాముఁడను గానా?

శూర్ప—చాలు, చాలు మీ సరసములు! ఇఁక మాటలు చాలించి మీ నిజచరిత్రఁ దెల్పుఁడు. నేను రాక్షస కాంతను, నాకు కోపమువచ్చెనా ... ...

విరాధు—వెఱ్ఱిసీతా! నీకు కోపము వచ్చుట! నన్ను నీవు మ్రింగుట! నన్ను నీవు పరీక్షించుచున్నావా? నిజమే; ఈ ఘోరారణ్యమున అప్పుడప్పు డిట్లు పరీక్ష చేయుటే మంచిది. అయిన నిఁక పుష్పములు చాలునా? (చూపుచు) ఆ రెండిటినిగూడ కోయుము. (అని మెత్తుకొనఁ బోఁగా బాణమొకటి తగులును.)

హా! సీతా! చచ్చితి, చచ్చితి. ఎవ్వఁడో నన్నుఁ జంపినాఁడు.

హా జానకీ! నేను నీ రాముఁడఁగాను; రాక్షసుఁడను, విరాధుఁడను. నిన్నపహరింపఁ దలఁచి ఈ రీతి నేలఁగూలితిని. (అని మృతిఁ జెందును.)

శూర్ప—అయ్యో! విరాధా! రామునిఁ జంప నుద్యుక్తుఁడవైన నీవే చచ్చితివా? మాయన్న కోర్కె లడుగంటఁ జేసితివా? అకటా! నేనును నీవే రాముఁడవని భ్రమించితినిగదా! నీవును నన్ను నిక్కపు సీతఁగాఁ దలంచితివా? సోదరా! నేను సీతనుగాను; శూర్పణఖను. (ఇటు నటు జూచి) ఏమి యీ చప్పుడు! ఎవ్వఁడో వచ్చుచున్నట్లున్నది. ఇప్పుడు ప్రాణము గాపాడికొనినఁగాని నిజమైన రాముని జూడఁజాలను.

(అని పరుగెత్తుచు నిష్క్రమించును.)

ప్రవేశము:—లక్ష్మణుఁడు

లక్ష్మ—ఓరీ! నిశాచరా! ఇంకెందుఁ బోయెదవు?

తే॥ గీ॥ తాపసోత్తములుండు నీ • స్థలమునకును
రాఁగతంబేమి? పేరేమి? • రాజ్యమెద్ది?
ఇటుల స్త్రీ వంచనము సేయు • టెంచితేల!
నిక్కమును బల్కు రాక్షసా! • నిలువు మచట॥

అంత బాలగంధర్వుఁడొకఁడు ప్రవేశించును.

గంధర్వుఁడు—(నమస్కరించును.)

* సీ॥ అనఘాత్మ! కేఁగుబే • రుని భృత్యుఁడఁగ గతు
నేర్పుగోడుత చాటి • నిక్కసతంబు,
సుగుణుఁడై బాగు మీ • రగఁ గొల్చుచుండి శు
భంబుగా మనుచుంటి, • బల్విధముల
తుద కమరాగ మెం • దుచు నే నొకప్పుడు
రంభగో కవారించి, • రాజుఁ గొలువ
మఱచుట, నీగతిఁ • సురరాజు నన్ను మ
హింబడంగ శపించె • నేమనందు!

గీ॥ శాపమది తీరినంతఁ • నేపుగ నతి
భక్తి ప్రభుని సేఁతయుఁ గొలు • వంగ నతఁడు
శ్రీపతి శరానలంబున • శాపము దొలఁ
గు; నిజరూపు సంసిద్ధి యు • గున నెఁ శ్రీతి!

దేవా! మీ శరసంధాన నైపుణి మిమ్ము త్రైలోక్య పూజ్యులగు శ్రీ మహావిష్ణు వని చెప్పకయే చెప్పుచున్నది. మహాత్మా! మీ దాసుఁడగు ఈ తుంబురుని తప్పు క్షమింపుము. (కాళ్లపైఁ బడఁబోవ)

లక్ష్మ—తుంబురుఁడా! నేను శ్రీరాముని యనుజుఁడ; లక్ష్మణుండను. అన్న యానతిచొప్పున నిన్నుఁ గనవచ్చితిని. మా జనకుని మిత్రుఁడగు జటాయువు ఈ పరిసరప్రాంతము

* ఇది మత్తకోకిలా కంద గర్భసీసము. కావున, మత్తకోకిలయు కందమును వేఱువేఱుగ పాడవచ్చును.]

లందు విహరించుచు, పరకాంతాపరిగ్రహణముంగాంచి, ఎలుగెత్తి యఱచుట మా రామభద్రుండు విని, నీపై బాణము సంధించెను గాని, నిక్కమరయ నీవు మా సీతామాతను డాయకయే శ్రీపతి శరానలంబున మృతిఁ జెందితివి. కాన నీ శాప విమోచనమయ్యెను. ఈ విషయమున నీవెంతయు ధన్యుండవు. మా యన్నగారిఁ జూడఁబోవుదము రమ్మీ.

గంధ—దేవా! చిత్తము.

(నిష్క్రమింతురు)

---

## ద్వి తీ య ర ం గ ము.

కత్తులపాటుతో మునులు ప్రవేశింప, వారివెంట శూర్పణఖ తన రాక్షస రూపమునఁ బ్రవేశించును.

ఋషులు—అమ్మా! మేముగాదు, మేముగాదు.

శూర్ప—ఛీ! దుష్టాత్ములారా! ఛీ! పాపాత్ములారా! ముచ్చుమునులారా! నా ముద్దుకుమారునిఁ జంపితిరా? కలుషమతులారా! చంపినవారు మీలో నెవ్వరు? నిజముఁ దెల్పుఁడు; లేదేని మిమ్మందఱిని ఒక్క గుక్కలో మ్రింగివేయుదానను.

ఛీ! పయోముఖ విషకుంభతుల్యులారా! మౌనముద్రాధరుఁడై, తండ్రి విరోధిని జయింపఁదలఁచి, తెపంబు సలుపు

చున్న నా ముద్దులపుత్రుని, నా జంబుకుమారుని, నా పట్టినిఁ జంపఁ గారణమేమి? శీఘ్రముగఁ జెప్పుఁడు. అమాయికుండగు వానిని జంపిన ఖలుఁడెవ్వఁడు? ఎందుఁగలఁడు? నిక్కమెఱిఁగించి ప్రాణములు గాపాడుకొనుఁడు క్రూరకర్ములారా!

ఋషులు—కామరూపిణీ! నిక్కము వక్కాణించుచున్నాము. నీ పుత్రునిఁ జంపిన నీచులు, కఠినహృదయులు, క్రూరకర్ములు మాలో నెవ్వరును లేరు. ఎవ్వఁడో ఇటు వచ్చినాఁడు; వలదు వలదని ఎన్నివిధముల వేఁడుకొన్నను వినక తన చంద్రాయుధముతో నీ కుమారుని ఖండించినాఁడు.

శూర్ప—హా! కుమారా! బ్రముచ్చుమునులారా! నిక్కమా! అయిన నా క్రూరకర్ముని నామమెఱుంగుదురా? అయ్యో! జంబుకుమారా! అన్యాయముగ వధింపఁబడితివి కదా!

ఋషులు—తల్లీ! మాకేమియుఁ దెలియదు. కాని, అట్టి మహాబలాఢ్యుఁ డీ ప్రాంతముల నెందును లేఁడు. నీ మృతపుత్రకుని కళేబర తుండెములం జూచి మా హృదయము నీరై చింతించుచుండఁగా సమయము గనిపెట్టి అతఁ డేవైపునకో పోయినాఁడు.

శూర్ప—వాస్తవమా?

ఋషులు—వాస్తవమే.

శూర్ప—అయిన పొండు. (ఋషులు నిష్క్రమింతురు)

అక్కటా! దిక్కులేని పక్కినై, ఒక్కతె నింకెక్కరణి మన నేర్తును? జీవితేశ్వరుఁడు మృతినొందినను, నా జంబు

కుమారుఁడు నా కాధారమని యెంచియుంటిని గదా. కటకటా! ఇఁక నాకెవరు దిక్కు? ఎంతకాలము నే నేకాంతమున నుండఁగలను? రాక్షసవంశ సంజాతుఁడని యెంచి ఎవ్వఁడో నా పుత్రునిఁ జంపియుండును. ఒకవేళ శ్రీ రాముఁడే యిట్లు చేసియుండునా? ఔరా! ఆతఁ డిట్టి కార్య మొనర్చునా? తపంబాచరించు వానినిఁ జంప సాహసించునా? ఒక వేళఁ జంపియే యుండు ననుకొన్నను, గతించినదానికై నేను మాత్ర మేమి చేయఁగలను? ఇట్టి తరుణమున ఇతర విషయమేమియు నాలోచింపక రాముని డాసి నన్ను భార్యగాఁ గొన వేఁడుకొనియెదను.

(నిష్క్రమించును)

ఒక ఋషి పునః ప్రవేశము

ఋషి—అమ్మయ్యా! చచ్చి బ్రతికితిని! ఆ పిశాచి యెందును లేదుకదా! (అని చూచి) దీని పుత్రుని చంపినది లక్ష్మణుఁడు. ఫలములను దెచ్చుటకై లక్ష్మణస్వామి ఈ ప్రక్కనున్న పొదను డాసి దాని కావలనున్న వృక్షమును సమీపించుటకు ప్రయత్నించి, తన కడ్డము వచ్చిన వానినెల్ల ఖండించుచు వచ్చెను. అతఁడు ఖండించిన పొదలలో నొకదానియందు ఈ రాక్షసబాలుఁడు తపము చేయుచు పొదలమధ్యమున నుండుటవలన అదృశ్యుఁడుగ నుండెను. ఈ విషయ మెఱుఁగక లక్ష్మణుఁడు బాలుఁ డున్న పొదను ఖండించి, కళేబర ఖండములను గాంచి,

మిక్కిలి చింతించి, ఆ వార్తను శ్రీ రామునకుఁ దెల్పఁగా నతండును చింతించెను. తరువాత నేమైనదో కాని ఎట్టు లైనను రాక్షసుఁ డొకఁడు చచ్చుట మాయింట్లను నూర్గురను గాపాడినట్లు ; కావున మా కందఱకు అమితా నందము గల్గినది. ఈ బాలుఁడే పెద్ద పెరిఁగిన ఎంత క్రూరుఁడగునో !

(నిష్క్రమింతురు)

# సీతాపహరణము

## ద్వితీయాంకము

స్థలము : పర్ణశాల] [ప్రవేశము : సీతా - రాములు.

రాము—సీతా!

గీ. రమ్య హేమంతఋతువు నేం • ప్రాప్తమగుచు
వేఁడిమియె లేక చలిగాలి • వీఁచుచుండి
అగ్నిహోత్రుండు జనమనో • హరుఁడు నయ్యో
కాంచితే దీని శోభను • చంచలాక్షి!

ఈ యుత్తరపు గాలి విసరుటంజేసి చలికిఁ దాళఁజాలక దేహములు సన్నగిల్లుచున్నవి. చండభానుండు సదాతీక్ష్ణముగ నుండుటే హితమనిపించుచున్నయది. రాత్రులు దీర్ఘములై సూర్యునిరాక నిరీక్షింపఁ జేయుచున్నవి. మన పట్టణములయం దింత కష్టము తోఁపదు. అయోధ్యలో సుఖముగ నుండుట మాని ఈ ఘోరారణ్యమున కేలవచ్చితివి? పితృవాక్యపరిపాలన కౌతుకమున నేను వచ్చుట తప్పదయ్యె. వలదు వలదన్న నీ వేల నా వెంటవచ్చితివి? నిన్నేవరీ యరణ్యమున కష్టపడుమనిరి?

సీ. నాతల్లి కేకయ • క్ష్మాతలేంద్రుని పుత్రి
కోరిక లతి ప్రీతి • గారవించి
నాతండ్రి దశరథ • భూతలేశుని నిత్య
సత్యవ్రతుని మాన • సమున నెంచి
వరములిప్పించి స • త్వరము తండ్రి విధించి
నట్టరణ్యంబున • కరుగుడంచు
చుండంగ నా ప్రియ • సోదరుండగు లక్ష్మ
ణుండు నాతో వచ్చు • చుండుటరసి

గీ. అబల నీవును మాతోడ • నరుగుదెంచి
తోడు నీడవునై సుఖ • దుఃఖములను
బాల్గొనెడి కాల మీనాఁడు • ప్రాప్తమయ్యె
కాలమొక్క రీతిగ నుండు • నే, లతాంగి!

సీత—నాథా! జరిగిన విషయమిప్పు డేల? ఎందున్న నేమి? మీతో వచ్చుటయే సర్వవిధముల శ్రేయోదాయకమని మీ రెఱుఁగరా?

సీ. భర్తృసేవాసక్తిఁ • బరఁగు నిల్లాలికి
కాననాంతరమె యు • ద్యానవనము
ప్రాణనాథునిఁ గొల్చు • పరమసాధ్వికి కంద
మూలంబె మృష్టాన్న • భోజనంబు
దైవ సమానుఁడౌ • ధవునిఁ బూజించెడి
సతికి పెను దుఃఖంబె • సౌఖ్యదంబు
పాపనాకారుఁడౌ • పతితోడ మెలఁగెడి
నాతికి లోకమం • తయుఁ దృణంబు.

గీ. అరయ ననుకూల దాంపత్య • గరిమఁదనరి
హాయిగా మనునర్థాంగి • కమల మతికి
చింత లవియేల సిరులేల • నీ్ద్ర మేల
ఘనతరంబగు భోగ భా • గ్యములు నేల ?

రాము—(ఒక వైపున కేగి పచ్చని గడ్డిపై జలబిందువులను జూచి) తరుణీ ! ఇటు చూచితివా ? (చూపించును.)

సీత—(చూచి సంతోషించుచుండును.)

రాము—కాంతా ! ఈ పచ్చని గడ్డిపై గురిసినమంచు బిందువులుగ నేర్పడి ముత్యముల ట్లగపడుచున్నది, చూడుము. ఎంత దట్టముగ మంచు కురియుచున్నదో !

గీ. పుష్యమాసంబు వచ్చె ఈ • పుడమియెల్ల
మంచుచే, గప్పబడుచుంట • గాంచెపేం
నీడయును నీరు గోరంగ • నేరరిపుడు
ఎండసోఁకుడు హాయిగా • నుండునబల!

తరుణీమణీ ! అదే చూడు మా తరుశాఖ క్రిందుగఁ గనుబడు సూర్యబింబ మెట్లున్నదో !

" గీ॥ మంచు తుంపర లెరసె వ్యా • పించుచున్న
కిరణముల తోడ సూర్యుండు • కరము దవ్వు
నందు నభ్యుదితుండయి • చందమామ
పోలె నున్నాఁడు గనుగొమ్ము • పుణ్యశీల ! "

(సీత సూర్యబింబమును జూడ చెట్లచాటున కేగును.)

[ప్రవేశము: శూర్పణఖ]

శూర్ప—(స్వగత) ఆహా ! ఎంతము ద్దైంత ముద్దు. నేఁడు గదా కన్నుల కఱవు తీఱినది. ఈ మన్మథాకారుఁ డెవఁడై యుండును? ఈతని తేజంపు బెంపు, ఈతని రూప వైభవము, ఈతని సుకుమార విలాసము నెందయినఁ ఎవరి యందయినఁ గలవా? ఔరా ! ఈతఁ డెవఁడై యుండును? ఎంత చిఱుప్రాయము ! ఈతనిఁ జూడఁ జూడ నా మానసము అనూనముగాఁ గొట్టుకొనుచున్నది. ఈతఁడు కేవల మనుష్యమాత్రుండని తోఁచదు. ఆహా !

సీ. భువనంబులను గావ • నవతారముల నెత్తి
యింతగా వెలయు శ్రీ • విష్ణువనఁగ
అతి భాషణములాడ • సతిఁ బాసి వచ్చిన
వలిమల యల్లుఁడు మహే • శ్వరుఁడనఁగ
తను మించు సుందరాం • గనలు శేరిని నీల్గు
రతిఁ గూడిన వల • రాజనఁగ
వైభవంబున పొంగు • వనితతోఁ గలహించి
నేకరి మెలఁగు దే • వేంద్రుఁ డనఁగ

గీ. మేని వర్ణంబు, కాయంబు, • మించు డంబు,
వైభవంబును గన్గొ యే • పారు నితని
జీవితేశునిగఁ గొను రా • జీవనేత్ర
కడు సుఖం బంది ధన్యురాఁ • గాదె తలఁప.

ఆహా ! ఎంతటి సుకుమారత ! చూడఁ జూడఁ నాఁడు కాంచిన శ్రీరాముఁ డీతఁడే యని మనమునఁ దోఁచుచున్నది.

ఇట్టి సర్వలక్షణ లక్షితుండయిన నవమోహనాంగుని విడువఁ గలనా ? ఒక్క సారియైనఁ గౌఁగిలింపఁ బ్రయత్నింపవలదా !

గీ. ఎంత సొంపెంత లావణ్య • మెంతచెలువ !
మెంత సుకుమార మెంతటి • కాంతి; ఇతనిఁ
దప్ప లాఁతి వానిని గోరఁ • దలఁచుకొంటె
చిచ్చునంబడి చావంగ • వచ్చుఁగాదె ?

(అంత సీత రాముని సమీపించును.)

ఔరా ! ఇది ఎవ్వతె ? ఇతని భార్యయా ! కాకున్న నింత నిర్భీతితో ఈతనిచెంత కరుదెంచునా ? ఇంత పని సేయ మానవకాంతలు సాహసింతురా ? ఇదేమి ? కాలయాపనఁ జేయుచున్నాను. అతఁడున్న భార్యాసహితుండై పోవుచున్నాఁడు. ఎందు పోఁగలఁడు ? ఇందే యుండును. ఒకవేళ నన్నాతఁడు చూచెనా ? చూచియుండఁడు. శీఘ్రముగఁ బోయి అతని పల్కరించెదను. (పోఁ బోయి) మఱచితిని. ఏమని పలుకరింపఁ గలను ? అయ్యా ! యని కాఁబోవు నాథుని సంబోధింపఁ దగును ! ఏమో ! ఎటుపోయి ఎటు వచ్చునో ? కావున మొదట నా భయంకరాకారంబును చూపి, తరువాత నారువేషమును దాల్చి, మాటలాడెదను. (అనుచు) ఎవఁడురా ? నిలు, నిలుమచ్చుట.

సీత—(శూర్పణఖ వచ్చు వైపుజూచి, వినుట నభినయించి) నాథా ! ఏ మాధ్వని ?

ఉ. ఈ వెనుభూత మెక్కడిదో
యీ దెసఁ జూడుము రాజచంద్రమా!
మాపటి భీతిఁగొల్పుతన
మాడ్కికిఁ దోడగు దీర్ఘకాయముం
దోఁప, దిగంతముల్ వణకు
నో యన, నార్చుచు వచ్చుచున్న యీ
రూపము గాంచినంత మది
లో వెఱపయ్యెడుఁ గాదె యేరికిన్!

రాము—సీతా! వినుము.

తే. గీ. కామినీమణి! రక్కసుల్ • కామరూపు
లగుట చిత్రవిచిత్రము • లైనరూప
ములను దాల్చుచు మనుజుల • మోసగింతు
రబల! నిక్కం బెఱింగి ధై • ర్యమున మనుమ.

ఆ వచ్చునది రక్కసి. (శూర్పణఖ రాముని సమీపించును.)

శూర్ప—ఓరీ! మానవాధమా! నీ వెవ్వఁడవు? ఇం దెట్లు వచ్చితివి? నిలుము.

రాము—(తిరిగిచూచును. సీత రాముని యొద్దఁ జేరును) ఎవ రైన నేమి? నోరుకాఁచి మాటలాడుము.

శూర్ప—నీ పేరేమి? నీ యూరేది? నీ వెవ్వఁడవు?

రాము—నేను ... ... (చెప్పఁబోఁగా)

సీత—నాథా! దానితో నేల? పోవుదము; రండు.

శూర్ప—ఓసీ! ఎంతటి పొగరే! "దానితో నేలయా?" నే నెవ్వ రనుకొంటివి? నీ యంతఁదగనా? అధములలో నధములగు మానవాధముల పొట్టను బుట్టిన నీవు, అందు నొక ఆఁడుదానవు. నన్నొక బానిస తొత్తుగాఁ దలంచితివా? ఇంత క్రొవ్వా? కొంచె ముండుము; నీ పనిఁ బట్టించెదను. (రామునిజూచి) శీఘ్రముగఁ జెప్పుము. లేకున్న మిమ్మందఱను ఒక్క గ్రుక్కలో మ్రింగుదానను.

రాము—సీతా! (మెల్లగ) ఈ రక్కసి కుక్కవలె అల్పసంతోషి, దీనిని అమ్మాయని సంబోధించి చూడుము.

సీత—(తలయూఁచి) అమ్మా! కోపగించుకొనకుము; నోరుజారి వచ్చిన మాటలకు మన్నింపుము.

శూర్ప—సరే; అయినే మీ రెవ్వరు?

సీత—చం. మనసిజ రూపవైభవస • మన్విత ధన్యులు వీరలిద్వురున్
ఇనకుల చంద్రుఁ డౌ దశర • థేశుని కూర్మితనూజ రత్నముల్
అనుపమ శౌర్యధుర్యులు, య • శోంచిత కాములు రామలక్ష్మణుల్
పనిపసి వీరలింపు వన • వా మొనర్పఁగ వచ్చి రంగనా!

శూర్ప—తెలిసినది; నే నెవతెనో తెలియునా?

రాము—[స్వగత] పేరు ప్రతిష్ఠ లేనివారు తమ చరిత్రములను జెప్పుకొనుట సహజమే!

శూర్ప—ఓయీ! [సీతకడకేగి] ఇప్పుడు చెప్పినదంతయు నిక్కమా?

రాము—కాంతా! నీ వెందున కిట్లు ప్రశ్నించెదవు? ఈ యల్పమునకే అనృత మాడవలెనా? ఈమె నా భార్య. విదేహ

రాజనందనునిఁ బుత్రి; సీత. అతఁడు నా సోదరుఁడు; లక్ష్మణుఁడు. నీ వెక్కడి నుండుదానవు?

శూర్ప—నేనా? ఈ యడవియందే తిరుగుచుందును. అయిన తాపసులమగు మేము తిరుగు స్థలమునకు వచ్చిన పని యేమి?

రాము—తల్లిదండ్రుల యానతిచొప్పున నిటకు వచ్చితిని.

శూర్ప—తల్లి దండ్రులేమి? ఆనతియేమి? తమ సుతులను కానలకుఁ బంపు తల్లిదండ్రులు గూడఁ గలరా? ఔరా! ఏటిమాటలు నేర్చినావు? రాజచంద్రా! వారేమని యానతిచ్చిరి?

రాము—[స్వగత] వాగ్ధోరణిని బట్టి దీని యభిప్రాయము వేఱుగా నూహింపఁ దగియున్నది. నడవడికలను బట్టి స్త్రీ పురుషుల గుణావగుణములను తెలిసికొనవచ్చును గదా! (ప్రకాశ) సీతా! నీ విటురమ్ము (శూర్పణఖతో), తరుణీ! అడవికిఁ బొమ్మనిన తండ్రి యాజ్ఞానుసారము వనవాసంబునకై యీ యరణ్యంబున కేగుదెంచితి. నీ వెవ్వరవు?

సీత—నాథా! ఆమె విషయము మీ కేల? రండు పోవుదము.

శూర్ప—(చూచి) ఔరా! ఎంత గయ్యాళి యిది! మగని కేయాపద కల్గునో యని వెంటఁ గొనిపోవుచున్నది. తమ భర్త లన్యకాంతలతో సంభాషించుటనైన తము నిజమగు సతులకు ఈర్ష్యఁ గలిగించును గదా! (ఆలోచించి,

తనలో) ఇంతటఅగు పలు తెఅంగుల వెలపింపం జూచితిని కాని ఎంత భయ పెట్టినను భయమొందక రక్కసినే ధిక్కరించుచున్నాండు. వీరవరుల లక్షణ మిది కదా! ఇంక నే నేమిచేయుదును ? తేనె లొల్కు తియ్యని మాటలే ఎట్టి కార్యమునైన చేయంగలవు; నూచెదను. కామ రూప ప్రసాద సాహాయ్యమున, నా యీ ఘోరాకార మును బాసి, చక్కని మానుషస్త్రీ రూపమును దాల్చి వచ్చెదను.

[నిష్క్రమించి, తక్షణమే మరల ప్రవేశించి]

అయ్యా! రక్కసతేని నామము వినియుంటిరా ?

ఉ. ధాతవరప్రసాద భుజ
దర్పమునన్ భువనత్రయంబు, పెన్
భీతి వడంకం జేయుచుం గు
బేర, మహేంద్ర, యమాది, నిర్జర
వ్రాతము పాదదాసులయి
వారకం గొల్వంగ లంక నేలు, ప్ర
ఖ్యాతిమురారి, రావణుని
యగ్గిసహోదరి నేను భూవరా !

రాము—ఔను. అన్న రాజుగానుండ అబలవగు నీ విందొం టిగ నుంటివేల ?

శూర్ప—(స్వగత) ఈతని ప్రశ్నలను జూడంగా నా వలలో పడునట్లే తోచుచున్నది. (ప్రకాశముగా) శూర శిఖా మణీ! నేనే వచ్చితిని.

రాము—ఇంత దూరము వచ్చితివేల ?

శూర్ప—ఊరక వచ్చితిని.

రాము—ఊరక యన్న నెట్లు ?

శూర్ప—పనియేమియుఁ దోఁచకుండినందున.

రాము—అన్నగారి సౌధమున నుండరాదా ?

శూర్ప—ఒంటిగనున్న నేమి తోఁచును ? ఒక్కింత తడవు ఈ వైపున వనవిహారము చేయఁ దలంచి యిట్లు వచ్చితిని.

రాము—ఏమీ ! మీ లంకలో ఉద్యానవనములు లేవా ?

శూర్ప—కలవు.

రాము—అయిన ఆ వనము లన్నియు దాఁటి యిచ్చటి కేల వచ్చితివి ?

శూర్ప—ఏమో వచ్చితిని ; వచ్చిన తప్పు కలదా ?

రాము—యువతు లొంటిగ నుంట తప్పే.

శూర్ప—ఇప్పు డిందఱ మున్నాము గదా ?

రాము—ఎందఱున్న నేమి ? మీవా రెవ్వరైన నొక్కరున్న ఇందఱుకాదు, లోకమంతయు చెంత నున్నటులే.

శూర్ప—(నవ్వుచు) రాజా ! మీరు మావారు కారా ?

ఉ. చక్కని వారలంచు, గడు
జవ్వను లంచు, జగంబు లోన, జే
రెక్కిన వారలంచు, సతి
కెంతె ప్రియంబుగఁ జాతురంచు, నన్

మక్కువఁ బెంచువారు, పలు
మారు వచింపఁగ వింతు, మిమ్మునే
నెక్కుడఁ జూచుభాగ్యము ల
భించున యంచుఁ బలంతు భూవరా!

సీ. విశ్వ సత్యవ్రత • ధీరుఁడవగు నిన్నుఁ
జూచి సంతసమొంద • వేఁచి యుంటి
భూరి సార శరీర • ధీరాంచితోదార
భావ! నీ ప్రేమంబుఁ • బడయ నుంటి
కందర్పు నుంపగా • కాంత! యిప్పుడు నీదు
మోము సమ్మోదఁగాంచి • ముదము గంటి
అఖిల లక్షణ లక్ష్మీ • తా! ఖండ భూమండ
లాధీశ! నీదాన • నగుదు నంటి

గీ. ఇంత కన్నను జెప్పు న • దేమి కలదు
పడఁతి నగు నేను గ్రొంబో • విడువఁ జనదు
ఆఁడుదానిని నన్నుఁబో • వాడఁదగదు
ధర్మ మాహాత్మ్యమ యిది తెలుప వలెను.

రాజచంద్రమా! మానవశ్రేష్ఠుఁడవైన నిన్ను భర్తగాఁ బడయఁగోరి యిట్లు వచ్చితి.

రాము—కాంతా! ఏమంటివి? భర్త యెవరు?

శూర్ప—ఎవరను వారే! ఏల యన్న

గీ. తగిన భార్యను నేనె నీ • కగుదు సుమ్మి
వలయు రూపంబు నేఁదాల్పఁ • గలను సుమ్మి
రూపు లేనట్టి యా సీత • రోఁత సుమ్మి
చూడు నా రూపమునఁగల • సొంపు రాజ!

అంతేకాదు.

చం. వినుతి పరాక్రమాఢ్యుఁడవు
విశ్రుతకీర్తి విహారుఁడీవు, నీ
ప్రణుతవినీలకేశహారుచి
రప్రభకన్, వికృతాస్యనైన, యీ
మనుజకులాధమాంగనకు
మాయురె! యెక్కడిపోలిక? నెక్కడన్
ఘనతర సత్వశాలి, మృగ
నాథునికిన్ గల తారతమ్యమా!

గీ. కామ రూపిణి యగు నన్ను • కన్నులారఁ
గాంచి, యీ కురూపిణి ప్రక్క • నుంచుకొనిన
మంచుఁడా! యేల నీకు నా • మందగూన?
హేళి నన్నేలుకొనుము నీ • యతివఁ గాఁగ

మోహనాంగా! నన్నుఁ జూడుము. నాకును ఆ గయ్యాళికినిఁ గల తారతమ్యమును నీవే కనుఁగొనుము. నేఁ జెప్పవలెనా? సరసుఁడవగు నీకు తెలియనిదా?

రాము—(నవ్వుకొని) విశాలాక్షీ! నిజము, నిజము. ఇంతీ! నీయంద మెక్కడ? ఈమె యందమేడ?

కం. నీ యందము నీ చందము
నీ యింతికిఁ గలవటన్న • నిలలో నగరే
నా యాత్మ కీమె చాలును
నీ యందము మించువాఁడు • నీకుంటఁదగున్!

శూర్ప—ఔనౌను. రాజా! మాటలు చాల బాగుగ నేర్చినావు, పోనిమ్ము. సీత నీకు నచ్చినదేకదా. సీతతోఁ గూడ నన్నును నీయొద్ద నుంచుకొనరాదా ?

రాము—బాగు, బాగు.

తే. గీ. వసుధ జార చోర భయంబుఁ • బాపవచ్చు
ఆజమున శత్రు తతిఁ జెం • డాడవచ్చు
లీల లోకంబు లెల్లఁ బా • లింప వచ్చు
స్వర్గముగ మార్పవచ్చు నీ • జగతి; నెంచ
భార్యలిరువురఁ బాలింప • బ్రహ్మతరమె?

శూర్ప—అంతయు నిజమే, కావుననే మీ తండ్రి యొకరు గాక, ఇద్దఱుగాక, ముచ్చటగ మువ్వురను గూడినాఁడు.

సీ. అతి సమర్థత నయో • ధ్యను నేలి మించిన
నీ తండ్రి నీయంత • నేరఁ డొక్కొ ?
ధర్మంబు దప్పక • ధార్మికుఁడై వెలసిన
నీ జనకుం డవి • నీతుఁ డొక్కొ ?
సత్యసంధుం డంచు • జగతిఁ గ్రాలిన యట్టి
నీయయ్య నీ యంత • నేరఁ డొక్కొ ?
సమ దృష్టితో సర్వ • జనులఁ బాలించిన
నీ బాబు నీ యంత • నేరఁ డొక్కొ !

గీ. తలఁచి చూడంగ నీ తండ్రి • దశరథుండు
ముచ్చటగ, మువ్వురనుగూడి • మురియలేదె?
ధర్మరహితుండె? యతఁడు మే • ధావి కాఁడె?
అతని కన్నను నీవ హె • చ్చైన వాఁడ
వౌర? మీబోఁటివారె, వా • క్శూరులనఁగ.

రాము—తరుణీ! చిరకీర్తిఁ గాంచిన మా తండ్రి కపకీర్తి యొందు గలుగునా యని అతని యాజ్ఞను శిరసావహించి ఇందు వచ్చితిఁ గాని కొన్ని విషయములందు, జనకునకును, తనయునకును అభిప్రాయభేదము లుండకపోవునా ?

తే. గీ. తండ్రి చేసిన పెల్లి, పు • త్రకులుఁ గూడఁ
జేయవలెనని యెవరైనఁ • జెప్పినారె ?
అటుల! యట్టి సిద్ధాంత మెం • దైనఁ గలదె ?
ఎవరి ప్రోకలు వారి కె • ట్టులఁగ వలదె ?

శూర్ప—రాజా! నీతుల కేమి గాని, నా యీమాట వినుము. (సీతను జూపి) ఇది నేను రక్కసిని, ఉత్తమ కాంతను. ఇది మానుషస్త్రీ. ఇట్టి స్త్రీలను నేను మంచినిఁ గ్రక్కున నొక్కమాఱు మ్రింగఁగల రక్కసిని. నేను నీ శత్రువుల నందఱిని మ్రింగి నిన్ను రక్షింపఁగలను. రమ్ము. మనము పోవుదము. దాని వి యేల ?

రమ్ము! (అని చేయిపట్టి, రాముఁడు తప్పించుకొని)

రాము—(స్వగత) ఛీ! ఛీ! ఏమి యీ రక్కసి సన్నిన్ని విధముల తొందరపెట్టుచున్నది! కామాంధురాలై, కన్నుఁ గానక నా యన్నుల మిన్నయగు సీతను కడు హీనురాలిగాఁ జెప్పుచున్నది. ఇట్టి మూర్ఖురాలి నోట నింకెట్టి మాటలును రానీక, నోరుఁ గట్టినట్లు మంచిమాటలు చెప్పి చూచెదను. (ప్రకాశముగ) శూర్పణఖా! ఈ సీతయే నాకు నెయ్యముగూర్చు ప్రియురాలు. మఱియు -

సీ. లోకేశ్వరుని సాక్షి • చేకొన్న కాంతను
విడనాడుటకు నేను • వెఱ్ఱిఁ గాను
ఉవిద సజీవనై • యుండంగ మతి చెడి
బహు భార్యలను గోరు • పాపిఁ గాను
ముద్దుఁ గుల్కుచుఁ బ్రీతి • ముద్దులాడెడు దానిఁ
గ్రూరత మోఁదు మా • ర్ఖుండఁ గాను
నీతికి దూరమై • లాఁతి భామల దండ
నుండ వాసించు హీ • నుండఁ గాను

గీ. కంటఁ బడు స్త్రీల నెల్లరఁ • గవయఁ గోరు
పాపు లున్నారు, వారల • ప్రాపుఁ జేరి
సుఖముగా నుండరాదె, యో • సుగుణ నిలయ !
ఇంక నను వేఁడ కింటికి • నేగు మబల !

శూర్ప—అబ్బబ్బా! ఎంత నీతి పరుఁడవు!

సీ. దారుకావన సతీ • వ్యమును తగుల్ గొన్న
ముక్కంటి నీ ముందు • మూర్ఖుఁడయ్యె;
కన్న కూఁతు రటంచు • నెన్నక, సుతఁ గూడి
మురిసిన యా బ్రహ్మ • మూర్ఖుఁడయ్యె;
మునికాంత యగు, నహ • ల్యను కౌఁగిటను గ్రుచ్చి
మురిసిన యింద్రుండు • మూర్ఖుఁడయ్యె;
కరము తెప్పఁగ నెంచి • గురుపత్నిఁ జేరి, బల్
మురిసిన చంద్రుండు • మూర్ఖుఁడయ్యె ;

గీ. వారలందఱు మూర్ఖులై • నారు, కాని
నిన్నుఁ బోలిన బుద్ధి సం • పన్నుఁ డొకఁడు

వాఁడు కేఁడారు వారల • నడత దిద్ది
నీతులను బోధ చేసెడు • నీతి పరుఁడు.

పాపము, నీ వా నాఁడు లేక పోతివి కాని, ఉండి యున్న శివ మహేంద్రాదులకు పుట్టెడు నీతులు గఱపి, వారి నందఱిని దురంతమగు నరకకూపమునుండి తప్పించి యుందువు.

రాము—ఇంతీ! ఆ సంగతి యిప్పుడేల ?

తే. గీ. పరసతులఁగూడి మురిసెడు • పాతకుండు
శివుఁడె యగుఁ గాక, బ్రహ్మయే • విష్ణువును గాక,
ఇంద్రుఁడగుఁ గాక, చంద్రుఁడై • యొసఁగు గాక,
వాఁడు మాత్రము నరక కూ • పమునఁ బడఁడె ?

శూర్ప—నరనాథా ! ఎన్ని రీతులఁ జెప్పినను ఈ నీతులే. ఈ నీతు లెవ రెఱుంగరు ? నాకును పది నీతు లెక్కువగనే తెలియును. ఈ లోకమున నీతులు తెలియనివారు మిక్కిలి తక్కువ; అన్నియుఁ దెలసియే దుర్నీతులకు లోనగుట ! ఓహో తెలిసినది. నే నేమో యనుకొంటిని ! ఇప్పుడు బోధపడినది మీ మనస్సు ! మీవారు స్త్రీలను నమ్మరా దని పల్కుట విన్నావు కాఁబోలు !

తే. గీ. ఆఁడువారల నమ్మిన • యట్టి పురుషు
లిలను చెడువార లను నుడిఁ • దలఁచి తొక్కొ?
అదియుఁ గాకున్న నన్ను నీ • సుదతిఁ గాఁగఁ
గైకొనమి కేమి కతమయ్య • రాకుమార ?

రాము—

తే. గీ. తరుణి! నీ వాడు రీతి నేఁ • దలఁప నెపుడు
నిక్కముగ నేను నోరుల నిం • దింప నెపుడు
ఎంచి చూచిన భువిలోన • నెందుఁగాని
స్త్రీలకన్నను పురుషులు • దీసిపోరు.

కం. పొలఁతిరో! ఏటికీ గతిని
మూర్ఖత నన్ పలుమారు వేఁడ, నీ
తలఁపును దీర్ప నేరనని
విధ్యముఁ బల్కితి శీఘ్రము మీవు, నీ
స్థలమును దాఁటిపొమ్ము, నిము
సంబిట నిల్వకు పొమ్ము పొమ్ము; నే
జలరుహనేత్ర సీతను
విచారపరీతను సేయ నేర్తునే?

(తనలో) ఔరా! పాడు మోహ మీ కాంత నెంతెంతఁ జేయించుచున్నది? కామాంధురాలై మన్ను మిన్నెఱుంగని ఈ రాక్షసిని ఇంక నా యెదుట నుంచరాదు; ఏదే నొక విధముగఁ బంపఁ బ్రయత్నించెద. (పైకి) శూర్పణఖా! రామునిబారికిఁ దాళఁజాలనేని, నా అనన్యసామాన్య లావణ్యరాశియగు సోదరుని కడకేగుము. అతఁడు నీకు ... ... ... ...పోయి యతని వరింపుము. (తనలో) లక్ష్మణుఁడు దీనికి బుద్ధిఁజెప్పఁగలఁడు. సీతా! రమ్ము, పోవుదము.

(సీతారాములు సమీపమునఁ గల కుటీరములోనికి పోయెదరు.)

శూర్ప—అయ్యో! ఇంకేమి చేయఁగలను ?

ఆ. వె. వేచి వేచి యుంటి! • చూచి కోరఁగ నుంటి !
చూచియైన ఫలముఁ • జూడకుంటి !
ఏమి సేయుదాన ! • నెవరి వేఁడెదుదాన!
యింతయైనఁ బ్రేమఁ • జూపఁడాయె !

(ఆలోచనచేసి) ఆకన్నె! అది కదా నాకడ్డువచ్చెను! సీతయఁట! విదేహరాజగు జనకుని కూఁతురఁట! చూచెదను. ఆ మాయలాడినిఁ జంపియో, మఱి యేలీరుననో, రాముని నా విభునిగఁ జేసికొనఁజాలనా ? ఇంతమాత్ర మీ కాంత చేయఁజాలదా? కాదేని ... ... ... ఛీ! ఎంత వెఱ్ఱిదానను ! ఇప్పుడు నేను చేయవలసిన కార్య మాలోచింపక, ముందెప్పుడో చేయఁగలదాని నాలోచించుచున్నాను. అతని తమ్మునియొద్దకు పోయి చూచెదను.

(ఉట్టితఱి లక్ష్మణుఁడు కుటీరము వైపు వచ్చుచు)

లక్ష్మ—(తనలో) నిన్నటిదినమున సీతాదేవిరూపమును దాల్చి, రామ వేషమున వదినెగారిని వంచింప వచ్చిన విరాధునిఁ జేరి, వాఁడు తనవాఁడని తెలియక మోహతాపమున మోసపోయి, ఆశాభంగమునకుఁ బాత్రయైన రాక్షసకాంత ఇట్లు వచ్చుచున్నది. స్త్రీవధ ఘోరపాతక మగుటచే ఈ కాంతను జంపక సాధుచిత్తుఁడనై, మంచి మాటల నిజగృహంబునకుఁ బంపఁ బ్రయత్నించెద.

శూర్ప—ధీరవరేణ్య! మీరేనా రామానుజులు?

లక్ష్మ—అట్లే యందురు.

శూర్ప—(లజ్జ నభినయించును.)

లక్ష్మ—అయిన లక్ష్మణునితో నీకేమి పని వచ్చినది?

శూర్ప—అయ్యో!

కం. వరియింపఁ వేఁడ, సీతా
తరుణీపతి రామనృపతి • దయఁ దలఁచును సౌ
దరుఁడ నగు నిన్నుఁ గనుఁగొని
వరియింపుము సౌమ్యునంగ • వచ్చితిననఘా!

లక్ష్మ—తరుణీ! ఎవరిని వరించుట! నన్నా! పిచ్చిదానా!

కం. పనివానికిఁ బ్రియురాలై
మననేర్తువె దానివగుచు • మహిళా! వికటా!
కనుఁగొన నుత్తమ కాంతవు
నను దాసునిఁగాఁగఁ గోర న్యాయంబగునే?

కామరూపిణీ! నిన్ను నిక్కముగా గ్రహించితిని. నీవే నన్నుఁ బెండ్లియాడినను నేను నిప్పటట్లు దాసుఁడనై యున్నానో, అట్లే నీవును దాసివై, రాముఁడు, అతని భార్య సీత మున్నగువారు చెప్పినట్లెల్ల చేయవలసిన దాన వగుదువు; ఏపని చేయుచున్న ఆ పనిని జేయవలెను; ఎందు బొమ్మనిన నందుఁ బోవలెను; ఇది యది యన నేల, ఏమి చెప్పినను చేయక తప్పదు. లోకములో నెవరైనను గొప్పవారిని జేపట్టి సుఖింప నెంతురుగాని, నాయట్టి

సేవకుని గోరిన ఫలముండునా ? కాంతా ! ఇంతయేల ? మా యన్నగారికే చిన్నభార్యవు గారాదా ?

శూర్ప—అతని మాటకేమి ? నీ వెంటివైయె యున్నావు కదా ?

లక్ష్మ—హాయిగ నొంటిగ నుండక, నుతి మెట్లుండవలె నందువు ?

శూర్ప—జంటగనుండి సుఖింపవలెను. ఇది లోకమున సహజము.

లక్ష్మ—నే పడు పాట్లు చాలవనియా ? వలదు, వలదు. మా యన్నకు చిన్నభార్య వగుటయే శ్రేయము.

శూర్ప—అతఁడు బహుభార్యా ప్రియుఁడు గాడఁట.

లక్ష్మ—అతఁడు కానియెడ, నేను మాత్ర మగుదునా ? కట్టుకొనినదానిని నట్టడవి పాలుచేయఁ జాలక, పుట్టినింట విడిచి వచ్చితిని. అట్టి భార్యను విడనాడి నిన్నుఁ జేపట్ట వలెనా ? (తనలో). ఏదో ఒకవిధముగఁ దప్పించుకొనఁ జూచెదను. (పైకి) కాంతా ! పోనిమ్ము. నేనే నిన్ను వరించితి ననుకొమ్ము. నావల్ల నీవేమి సుఖించెదవు ?

ఆ. వె. వృద్ధుఁడైన నాకుఁ • బ్రేయసి వగు దంచుఁ
బలుకఁదగునె వయసు • భామ వగుచు?
నీ సురూపమేడ? • నే నేడ? నను జూడ
రోఁత పుట్టకున్నె • నాతి నీకు?

నిన్ను నే నొల్ల. నీవేమైనను దలంపుము. నీవేమో, మాయన్నగారేమో, ఇఁక పొమ్ము! నాకు వేళ మించుచున్నది. (అని నిష్క్రమించును.)

శూర్ప—అక్కటా! ఇంతసేపు హేళనచేసి మఱల రాముని కడకే పొమ్మని నాఁడు గదా!

ఉ. ఎందనిఁ బోవుదాన నిఁక
        నెవ్వరి వేఁడఁ గలట్టిదాన; నా
    సుందము చంద మారసి, ధ
        రాధిపుఁడౌ రఘు రామచంద్రుఁడున్
    గ్రందుగఁ బ్రోచి, నన్ను, తన
        కాంతగ గైకొను నన్న యాశచే
    నందని మ్రానిపండులకు
        నఱ్ఱులు సాచితి నక్కటక్కటా!

ఛీ! ఛీ! ఏటికి నాకింత సంతాపము! (యోచించి) ఆ మాయలమారి, ఆ కురూపి, ఆ దుర్నీతిపరీత, సీతను, ఆ గయ్యాళినిఁ జంపఁ బ్రయత్నించెదను. అది చచ్చునేని ఇప్పుడు గాకున్నను కొలఁదికాలములో రాముఁడు నన్ను భార్యగఁ గైకొనఁగలఁడు. కావున తడవు సేయక సీతను జంపెదను.

[కుటీరములోని కేఁగి, సీతారాములతోఁగూడ ప్రవేశించును.]

శూర్ప—(రాముని పాదములపైఁబడి) మోహనాంగా! మీ యిద్దఱిలో ఎవ్వరును నన్నుఁ బ్రోవకుంటిరి. ఇఁక ఏమైనను సరియే. సవతిపోరు లేకుండఁ జేయు యుక్తి తోఁచినది. ఇఁక నా కడ్డులెమ్ము. దీనిని మ్రింగెదను.

సీత—(భయపడుచు రాముని ప్రక్కను చేరును.)

రాము—(అడ్డుపడి) ఓసీ!

గీ. దనుజకుల వైరి వయ్యును • దగిలె వగుట
ఇంత వలుకు నిన్నుడు • నిన్నుం గాను
ఇంక నిట నిల్చెదేని • శృంగతోడ
యమ పురికిం బంపెదను నిన్ను • నతివ! నిజము

(అప్పుడు లక్ష్మణుఁడు వచ్చును.)

శూర్ప—మాయలమారీ! ఎంతరాగవే! రాముఁడు నిన్నుఁ గాపాడువాఁడా! ఇదే వచ్చెదను. (అని నిష్క్రమించి, ఘోరాకారమున వచ్చి సీతపైఁబడె.)

లక్ష్మ—మూర్ఖురాలా! ఎన్ని చెప్పిన వినవా? (అని కత్తి దూయును.)

రాము—లక్ష్మణా!

తే గీ. కలువమతి యనఁ గోరెంత • పలుకు వినక
మీరకుండిన సెప్పగా • నందు; రెండు
అల్పుఁ డనఁగూడి పోపోస • వాడు బెల్ల
వ్యక్తికముతోడ నాడాడు • విధము గాదె॥

లక్ష్మ—సోదరా! దీని నెట్లు దండింతును?

రాము—ఇట్టి చెట్టయగు దీనిని జూచుచుండఁ దగదు వెంటనే దీని ముక్కు చెవులను గోసి విరూపిం జేసి పంపుము.

లక్ష్మ—(కోయును.)

శూర్ప—(రోదనమొనర్చి) హా! క్రూరా! కోసితివా? నన్ను కురూపిం జేసితివా? మూర్ఖా! నీ సీతను సైతము నావలె చేయనా? పాపీ! నాబోంటి స్త్రీ తలంచిన నెంత కార్యము చేయఁజాలదు? తాళుఁడు; మీ ముప్పురఁ గొంప్పడఁగించెద.

(నిష్క్రమించును)

---

# సీతాపహరణము

## తృతీయాంకము.

---

### ప్రథమ రంగము

స్థలము: ఖరుని మందిరము] [ప్రవేశము :—శూర్పణఖ

శూర్ప—హా! దుర్భరము! చచ్చితి, చచ్చితి. అన్నా! (అని దిక్కులు పరికించి). అక్కటా! మా అన్నయుఁ గన్పింపకున్నాఁడు. ఇప్పటికైన నేమి చెయుదును?

తే. గీ. కాననంబున నొంటిమైఁ • గ్రాల నేల?
క్రాల నేమాయె? వారలఁ • గాంచ నేల?
కాంచి నంత మోహము గొల్పఁ • గ్రమ్మ నేల?
ఇంత రానేల? కటకటా! • యెవరు దిక్కు?

అక్కటా? ఇప్పుడేమి చేయుదును? నే నా వీరుల కడ కేల పోయితిని? ఇట్టి యిక్కట్టులేల కల్గెను? కటకటా! నన్నెవ రోదార్చువారు? అయ్యో! సోదరుడింకను రాకపోయెనే. ఎప్పుడు వచ్చునో కదా? నా కసి యెప్పుడు తీరునో కదా? ఆ జగజంతను, ఆ మూర్ఖురాలి, నా మాయలాడిని, ఆ వైదేహిని, ఆసీతను జంపించెదను. లేదా, నాయట్లు కురూపిణిగ నైనఁ జేయించెదను. అప్పుడు కదా నా కసితీరుట. (ఆలోచించి) వచ్చిన

పని కిచ్చుట నా ప్రియసోదరుఁ డిచ్చుటయుఁ గానరాఁడు గదా! హా! ఇప్పుడేమిచేసిన లెస్స? ఎవరు నా యన్నను బిల్చుకొని వచ్చెదరు? ఇట్లు చేసెద. నేలఁబడి రోదన మొనర్చి వెలుపలనున్న వీరులు వినునట్లు చేసెదను. వచ్చి చూచిన వారు మిన్నకుందురా? తప్పక నా సోదరునితో నా విషయమును దెల్పెదరు. నాయన్న రాఁగలఁడు. అతనిఁ బురికొల్పిన, ఎట్టి కార్యమునయినఁ జేయఁగలఁడు. (నేలఁబడి యేడ్చును.)

[ ప్రవేశము:—కరవీరాఖ్యుఁడు ]

కరవీ—ఏమిది! (సమీపించి) మా శూర్పణఖమ్మ, మా యమ్మ, రాజుగారి యింటికొమ్మ, యీ చిత్తరుబొమ్మ ఏలనోకాని యీ బాల చాల విచారమున నేలఁ బొఱ లాడుచున్నది? ఎట్టి యాపద కల్గెనో కదా! కాదేని యీ కాంత, యీ విధముగ ఏడ్చుటయుఁగూడఁ గలదా! (దేహమును అందమునుజూచి వెఱగొంది) ఔరా! ఏమి యీ యాపద! ఎన్ని గాటులున్నవి! ఏమి యీ దౌర్జ న్యము! ఎవ్వఁడీ కార్యము జేయఁగల్గెను!

[ ప్రవేశము: ఖరుఁడు. ]

కరవీ—రాజా! సమయమునకే వచ్చితివి. ఇందుఁ జూడుము. చూచితివా నీ చెల్లెలను! ఏక్రూరుఁడో ముక్కు చెవులు జెక్కినాఁడు. ఔరౌరా! ఎట్టి ఘోరకార్యము!

ఖరు—ఏమి! (తొందరగఁ) జూచి ఎవ్వఁడు? ఎవ్వఁడీ కార్యమును జేసెను? ఎందున్నవాఁ డా దుష్టుఁడు? ఎటఁ

గలఁ డా ఖలుఁడు ? కరవీరాక్షా ! నీ వేమైన నెఱుంగుదువా ?

కరవీ—రాజా ! నేనును నీవలె నిప్పుడే చూచుచున్నాను. నీకన్న రెండు మూఁడు నిముసములకు పూర్వము వచ్చితినే. నేనుమాత్ర మెట్లెఱుంగుదును ?

ఖరు—ఐన నామెనే యడిగెదను (బిగ్గరగ). చెల్లెలా ! ఏమిట్లుంటివి ? లెమ్మ.

శూర్ప—(లేచి) హా ! అన్నా ! వచ్చితివా ? (ఏడ్చును)

ఖరు—అమ్మా ! తత్తఱపాటేల ? ఎవ్వఁడు? ఏ మూర్ఖుఁడు? ఏ క్రూరాత్ముఁడు నిన్ని వెతల పాల్పేసెను ? ఎందున్నాఁడా దుర్మదాంధుఁడు ?

శూర్ప—(కన్నీరు గార్చుచు) సోదరా! ఏమందును ? ఎంతటి బలాఢ్యులు ! ఎంత సౌందర్యవంతులు ! దశరథుని పుత్రులు రామలక్ష్మణులఁట ! మన జనస్థానమున, వనవాసమునఁట !

ఖరు—ఏమీ ! దశరథుఁడా ! అతని పుత్రులు రామలక్ష్మణులా ! ఔరా ! (ఆలోచించి) (కరవీరాక్షునిపై చేయివైచి) అయ్యో !

మ. కరవీరాక్ష ! మదాంధకారులయి యీ
కాంతాశిరోరత్నమున్
పరిమర్దించిన దుర్వినీతు లెవరో
వాక్రువ్వ వింటిగదా ?

త్వరితగన్ సైన్యసమేతులై మన జన
స్థానంబునకుం జేరి, క
ల్లరులా సోదరు లిద్దరన్ గవిసి
కూలం జేసి రా పాపాత్ములన్.

కరవీ—చిత్తము! (నిష్క్రమించును.)

ఖరు—చెల్లెలా! ఏల ఈరీతి చింతఁదూరెదవు? నీ పరాభవమ్మునకుఁ గారకులైన నీచాధములఁ జించి చెండాడుఁ డని నా సైనికులఁ బంపినాఁడను! చింతింపకుము, లెమ్మా!

శూర్ప—ఏమైనను జేయుము, ఎట్టివారి నైనను బంపుము.

ఖరు—(నగుచు) ఏమేమీ! చెల్లాలా, ఏమంటివి? భూరి బలోపేతులగు మావారలను జూచి, హరిహరాదులు సైతము గడగడ వడఁకఁ గలరు. కావున నీ వెంతమాత్రము జింతిల్లకుము! తెలిసెనా? సరి. చెల్లెలా నీ వెందుఁబోయితివి?

శూర్ప—(లోపల) నిక్కమును దాఁచి, ప్రశ్నానుకూలముగ బదులు చెప్పెదను. (పైకి) దండకారణ్యమునకు.

ఖరు—ఏల?

శూర్ప—పోవలెనని కాదు. దారితప్పి యట్లు పోయితిని.

ఖరు—రామ లక్ష్మణుల నెందుఁ జూచితివి?

శూర్ప—వారు వేఁటాడుచుండు సమయమున.

ఖరు—ఏ మృగయార్థము?

శూర్ప—ఏమో! యెఱుఁగను.

ఖరు—అయిన సీతతో వైరమెట్లు సంభవించెను?

శూర్ప—వైరమా! అటు పోవుచున్న నన్నుఁ జూచి, చంప వచ్చిరి.

ఖరు—ఔరా! అకారణముగ వారు నీ జోలికేల వచ్చిరి?

శూర్ప—అదియు నే నెఱుఁగను.

ఖరు—రక్కసి వగుటచేఁగాఁబోలు! పోనిమ్ము. నీ వప్పుడేమి చేసితివి?

శూర్ప—ఒక్కతె నేమి చేయఁగలను? ఎట్లయినఁ దప్పించుకొనఁజూచితిని.

ఖరు—మంచిది. అంత వారేమి చేసిరి?

శూర్ప—(ఏడ్చునట్లు నటించి) అన్నా! ఏమని చెప్పుదును? ఎన్ని విధముల కష్టపెట్టవలెనో అన్నివిధములను గష్ట పెట్టిరి. నేనేమి చేయుదును? నన్ను పట్టుకొని తమ్ము పెండ్లాడు మని బలాత్కరించిరి! నేను తప్పించుకొని పరు వెత్తి నీ యొద్దకు వచ్చుచుండఁగా, లక్ష్మణుఁడను నొక కర్కశహృదయుఁడు నన్నుఁ బట్టి యింత కార్యముఁ జేయఁ గల్గినాఁడు. ఇన్ని విధముల భంగపడిన నాయట్టి నిర్భాగ్యురాలు భువిలో మన్ననేమి, మృతిఁ గన్ననేమి?

ఖరు—(తలయూచుచు) చూచెద. ఇఁక నాకు ప్రొద్దు పోవుచున్నది. నీ విందే యుండుము, ఎంత మాత్రము దుఃఖింపకుము. ఇప్పుడే రాజవైద్యునిఁ బిలిపించి రహస్యముగ తగిన చికిత్సఁ జేయించెదను. (నిష్క్రమింతురు)

శూర్ప—(తనలో) ఇప్పుడు నా యంతరంగమున సంతసము గల్గుచున్నది. ఇఁక నా కోరిక లీడేరుట నిక్కము. నేను మాత్ర మిందుండనేల? ఎవ్వరును జూడకుండ నేనును పోయి చెట్ల గుంపున డాఁగియుండి సోదరుని సైనికులం బలంబరసి వచ్చెదను. ఒకవేళ నావారే యపజయమొందెదరేని, నే నావార్తను శీఘ్రముగ సోదరునితోఁ జెప్పి మఱికొందఱు వీరులను బంప నుద్యమించెదను. ఆహా! ఎన్ని యిడుమలఁ బడినను కడకు విరోధుల వధను జూడఁ గల్గుదును. ముక్కు చెవులుపోయిన పోవుఁగాక!

(నిష్క్రమించును)

## ద్వితీయరంగము.

[సీతా, రామ, లక్ష్మణు లుందరు.]

రాము—లక్ష్మణా! క్షణకాలము సీత చేరువ నుండుము. ఎవరో రక్కసులు వచ్చుచున్నట్లు ఘీంకార శబ్దములు వినవచ్చుచున్నవి. (కోపల శబ్దము) అదిగో వారిటు వచ్చిన అవశ్యము వారిని జంపెదను.

(లక్ష్మణుఁడు కుటీరమువైపు నిష్క్రమించును. సీత లోని కేగును.)

(ప్రవేశము : కరవీరాక్షుఁడు మఱికొందరు రాక్షసులు.)

కరవీ—ఓరీ! నీ వెవ్వఁడవు, నీ పేరెద్ది. యూరెద్ది ? (రాక్షసులు కేకలు వేయుదురు.)

రాము—ఓరీ! సురారీ! ఇట్లింపుగను మఱియొకమారు ప్రశ్నించకుము. ఓరీ! దశరథాత్మజుఁడను, శ్రీరాముఁడను. నాకు ... ... (అని పల్కుచుండ, రాక్షసుఁ డడ్డుపడి)

కరవీ—చాలు, చాలును. తెలిసెను. నీవేనా మా శూర్పణఖ ముక్కు చెవులను గోసిన నీచాత్ముఁడవు? సైనికులారా! చంపుఁడు. వీనిపైఁబడి ఖండఖండములుగఁ జెండుఁడీ దుండగీని. చూడుఁడు! వీఁడేనఁట మన శూర్పణఖను వేధించిన క్రూరాధముఁడు.

(రాక్షసులు అఱచుచు పైఁబడఁ బోవుదురు.)

రాము—రాత్రించరాధములారా! వినుఁడు. మాటలాడక పోవుదురేని పొండు. పోవజాలక అధికప్రసంగముల కొడఁబడెదరేని ఈ క్షణమె యిట్టెట్టనే మిమ్మందఱను ఒక్కపరిఁ గూల్చువాఁడను. ఇదే కాచి యుండుఁడు.

రాక్ష—ఛీ! ఛీ! తుచ్ఛమానవా! కుచ్ఛితుఁడవగు నీకా యీ రాక్షసులు వెఱచుట! (రాక్షసులు బాణములు వేసెదరు) రాముఁడు నట్లే యొనర్ప రక్కసులు నేలఁబడెదరు.)

కరవీ—(దూరమేగి) (స్వగత) ఔరా! వీనికెంత పరాక్రమము గలదు! ఒక్కఁడే యిందఱినిఁ గూల్చెనే. ఇఁక సోదరు లిద్దఱుఁ జేరిన నేమి కలదు! ఒక్క రక్కసుని

ప్రాణము దక్కునా? ఖరదూషణాదులైన నీతని యెదుట ఒక్క నిమిషము నిలువ నేర్తురా? ఔరా! ఈతఁడింత బలవంతుఁడని యెఱిఁగియుండిన నేనింత దూరము వచ్చియే యుండను. వచ్చి యెంత బుద్ధిహీనుఁడనైతిని. పరుగిడి పోయెదనా! ఛీ! పిఱికితనమేల? ఇందే యుండి చేతనైనంతే వఱకుఁ బోరెదను. (యుద్ధము చేయుచు)

హా! చచ్చితిఁ; జచ్చితి. శ్రీరామా! ఎంత బలాఢ్యుఁడవురా? (చచ్చును.)

రాము—రక్కసులందఱు నిహతులైరి. ఇఁక వీరి భయము దీఱెను. (నిష్క్రమించుచున్న.)

[ ప్రవేశము: శూర్పణఖ ]

శూర్ప—ఆహా! ఎట్టి పరాక్రమశాలి యీతఁడు! చూచుచున్నంతలోనే, మా రాక్షససైన్యంబు సర్వంబును రూపుమాపి మధ్యందిన మార్తాండునిమాడ్కిఁ దేజరిల్లుచున్నాఁడు. ఈతని యుత్సాహ బల శౌర్యంబుల నేమని కొనియాడఁగలను! ఔరా! ఈతని సమక్షమున నిఁక నిలువఁ గలవారెవరు? నా సోదరులు ఖరదూషణులు మాత్ర మీతని నెదర్చి గెలువనోపుదురా! అదియును చూచెద! ఇఁక కాలముఁ బుచ్చక ఖరునియొద్దకుఁ బోయెదను.

(నిష్క్రమించును)



## తృతీయ రంగము.

[సైన్యసమేతులై ఖరదూషణులుందురు.]

ఖరుఁడు—దూషణా! ఇట్టి వింత యెందైనఁ గలదే! ఔరా! ఒక్క ప్రముక్కడి మానవునకా యింత కండకావరము! మనల నెవరిఁగాఁ దలంచి వాఁడింత సరకుచేయకున్నాఁడు! వానివలె క్షత్రియగాత్రు లనుకొనెనా? హీనమానవులము గామని యెఱుంగఁడా? మనము సురారిశేఖరులమని వానికిఁ దెలియదా? ఇప్పుడె తెలియఁజేసెదము. దేవత లంతటివారినిఁ జావఁ దన్ని దాసానుదాసులుగఁ జేసి కొనఁగల్గిన ఈ రాక్షసేశ్వరులకు సాఁగిలఁబడి మ్రొక్కు లిడుటకు మారు నిశ్శంకతో హానిఁ జేయఁదలంచెఁగా! ఔర! ... ...

దూషణు—అన్నా! అదే సమీపమున నెవఁడోఁ గానవచ్చెడిని.

[రాముఁడు వచ్చును]

ఖరు—(చూచి) దూషణా! లెస్సఁగఁ బల్కితివి; రమ్ము. (సమీపించి) ఓరి! దుర్మదాంధ! నిలుము.

మూర్ఖా! ఏమెఱుఁగని బాలను బట్టి ముక్కుఁ జెవులుఁ జెక్కినట్లు గాదు. పరివారితోఁ బోరవలయును.

కం. మ్రుక్కడులను లెక్కింపఁడు
మిక్కిలి బలశాలి నైన • మేటి, జగమునన్

లెక్కించును సరివారలఁ
దక్కంగల వాఁడె గర్వి • ధరనని వినవే.

ఛీ! ఏదీ నీ శూరత్వము.

ఉత్సా. పురుషసింహుఁ డగుచు నేఁ • భూరి తేజమొప్పఁగా
ఘోరమునందు మనుష్యశాఖి • దోర్బలంబుఁ జూపురా

దూషణు—

కపట మెప్పగాఁ దలంచి • కన్నుఁ గానకిట్టులన్
తరుణిఁ బట్టి గాసిఁ బెట్టఁ • దగునె మానవాధమా !

రాము—

మత్త. ఓరి దానవులార మీకిటు • లుగ్రవాక్యము లేలరా
శూరులై భుజశక్తిఁ జూపినఁ • జూపరాదె రణంబునన్.

ఖరు—

ఓరి ధూర్తుఁడ ! నిన్నెదుర్కొని • యుద్ధభూమిని భీతుఁడై
పారిపోవఁగ నేను దానవ • భామ నంచుఁ దలంచితే.

ఉ. తాటకిఁ గాదు నిన్నుఁ గని
[illegible] బాలక నేలఁగూలఁగా
నూటికి [illegible]రుసల్పఁ గల
శూరవరుల్, ఖర దూషణుల్, గనన్
కీటకమట్లు మా యెదుట
నిల్చెద వేటికి మానవాధమా?

రాము—

ఏటికి నీటు మాటలను
నిర్వ్యధిఁ బల్కెదు రాక్షసాధమా?

వినుతిం గాంచిన మను డీ
కొని ప్రాణముల విడువఁ • గోరెదు మూర్ఖా?

రాము—

ఉ. ఓరి! మహోగ్రకల్మషుఁడ !
ఓరి మదాంధుఁడ యో దురాత్ముఁడా !
వీరము లేలఁ బల్కె దిటు?
ప్రేలెద వేటికి మాటి మాటికిన్ ?
భూరిబలుండ వేని, ఖర
మున్ రణరంగమునందు నీ భుజా
సారముఁ జూపి నన్ గెల్చి
చయ్యనఁ బొమ్ము వచఃప్రగల్భుఁడా!

దూషణుఁడు—ఓరీ!

కం. దేవత లంతటి వారినిఁ
గావంగన్ దన్న; వారు • సర్వస్వంబున్
బోవిడిచి సాగిలం బడి
మా వారికి మ్రొక్కులిడుదు • మనుటన్ వినవే?

ఖరుఁడు—ఓరీ! వెఱ్ఱిమొగమా! మమ్మున్ నీవు వెఱపింపఁ జూచెదవు? నిన్నుఁ బోలు నొక్క మానవుఁడా యిందఱితోఁ బోరి జయించుట!

రాము—ఓరీ! నిశాచరా! ఒక్క యగ్నికణము లక్షల కొలంది వృక్షసముదాయములం గల ఘోరారణ్యములను భస్మీభూతముఁ జేయు టెఱుంగవా?

ఖరుఁడు—ఓరీ ! క్షత్రియకులకళంక ! ఇఁక నీతోఁ బలుక తగదు. సైనికులారా! ఈ క్రూరునిపైఁ బడి వీని యూపు మాపుఁడు.

రాము—

ఉ. ఓరి నిశాచరాధమ ! మ
హోజ్జ్వలభక్తియుతాత్ములౌచుఁ, బెన్
గూరిమి నీవనంబులను
గ్రుమ్మరుచుండెడి మానులన్ సదా
క్రూరత హింసఁబెట్టి మను
కూళల మిమ్ములఁ జెల్ల నేఁడు, నీ
క్రూర నిశాతబాణమునఁ
గూల్చి, మునీంద్రుల కింపుఁ గూర్చెదన్

(సైనికులు కేకలువేయుచు రామునిపైఁ బడఁబోయెదరు ; రాముఁడు బాణము ప్రయోగించును ; రాక్షసులు నేలఁ గూలుచుందురు.)

దూషణు—అన్నా ! ఏమిది ? ఇంక మనమేమి ? పోరాడు టేమి ? వలదయ్యా నాకీ చావు. నీవే యిందుండుము. నేను ... ... ... ...

ఖరుఁడు—దూషణా ! ఏల యింత పిరికివాఁడ వైతివి ? భీతి యేల ; మనమును పోరుసల్పి బాహుబలమును జూపుదము రమ్ము.

(ఖర దూషణులు పోర నారంభింతురు. దూషణుఁడు చచ్చును.)

ఖరుఁడు—(ముందునకు వచ్చి) ఔరా! దూషణుఁడు మడిసెను. పదునాల్గువేవురుసైనికులు రామబాణాగ్ని కింధనమైరి! సోదరుఁడు దూషణుఁడు మడిసెను! ఇంక నేనేమి చేయుదును! సాటిలేని మేటి పోటరియగు నతని మ్రోల నే నిలువఁగలనా? నిలువలేను. అయినను వెనుకంజ వేయుట కల్ల! నా దైత్యలోకమునకంతయుఁ గళంకము! పోరొనర్చియే చూచెదను!

(ఆలమొనర్చి గాయమొంది)

శ్రీరామా! నీ వనన్య సామాన్యుండ వనుట ఇప్పుడు తెలిసెను. నిన్నెదుర్కొనుటకుఁ గల కారణంబులు వినుము.

సీ. నా చెల్లెలౌ శూర్ప • ణఖ ముక్కు చెవులను
గోసి నాఁడ వటన్న • కోపమునను,
ఏమియుంగని వాల • నెదిరించి, భార్య గాఁ
గొనఁజూచితి వటన్న • కోపమునను,
మ్రుచ్చులౌ మునులను • హెచ్చు ప్రీతినిఁ గాచి
కూర్మిఁ జూపెద వన్న • కోపమునను,
మా కీర్తి నశియించి • నీ కీర్తి దశదిశల్
వ్యాపించుఁ గా యన్న • కోపమునను,
గీ. చెల్లె లాడిన వాక్యముల్ • చెవినిఁ బెట్టి,
సత్యమును విచారింపక • సాహసించి,
నిన్నెదుర్కొని యీ రీతి • నేలఁగూలి
ప్రాణములఁ బాయుచున్నాఁడ రామచంద్ర!

(నేలఁ గూలును)

రాముడు—ఖరుఁడా! నిక్కము వక్కాణించెద వినుము.
స్మరశరాహతికిఁ దాళఁజాలని నీ భగిని శూర్పణఖయే
నీ మరణమునకుఁ గారణమని తెలియుము!

ఖరుఁడు—మా ... ... దే ... ... ను(చచ్చును) (తెరజారును).

(విష్కంభము)

---

(లోపలధ్వని; కొందఱు ఋషులు రాముని నుతింతురు).

దండకము.

ఋషి—శ్రీరామ రామా! పరంధామ! కారుణ్యసీమా!
ఘనశ్యామ! ఓశౌర్యసుత్రామ! యో దోర్బలోద్దామ!
యో సద్గుణస్తోమ! యో భక్తకల్పద్రుమా! రామ!
రామా; త్రిలోకాభిరామా! నినుంగూర్చి, నీచర్యలం
గూర్చి, సాంగంబుగా వర్ణనల్ సేయఁగా శక్తియుక్తుండునే
మానవుండున్నె త్రైలోక్యసామ్రాజ్యా! సురల్ వేడఁగా
వారికష్టంబులం బాపి, సౌఖ్యంబులం గూర్ప; మీనంబవై
వృష్టిఁ జేఁ ద్రిమ్మరిన్ సోమకుం జంపి, వేదంబులన్ బ్రహ్మ
కర్పించినావే! వెసన్ కూర్మరూపంబునన్ దాల్చుచున్;
మంధరం బెత్తుచున్, ప్రీతింగోడన్, సుధన్ దేవతల్
దృప్తిగాఁ గ్రోలఁగా నిచ్చినావే! వరాహావతారంబునన్
దాల్చి, యుద్దామశక్తిన్, ధరిత్రీతలం బెత్తుచున్ స్వర్ణ
నేత్రాఘమున్ జంపి లోకంబులం గాచినావే! నృసింహుం
డవై రాక్షసోరస్థలిన్ వ్రచ్చి ప్రహ్లాద భక్తున్ గృపన్

బ్రోచితే! వామనాకారుఁడవై యా బలీంద్రున్ సమీపించి, యాచించి, మూఁడడుగులన్ ముజ్జగంబుల్ ప్రియంబారఁగాఁ గాఁచినావే! లలిన్ భార్గవుండౌచు రారాజభంగంబు గావించినావే! లసత్ సూర్యవంశంబునందుద్భవంబంది గాధేయు యాగంబు రక్షింపవే! ఱాతినిన్ నాతిఁగాఁ జేసి, శాపంబునున్ వాపి ముక్కంటి విల్ ద్రుంచి సీతామతల్లిన్ వివాహంబుఁ గావించుకోవే! కృపాసాంద్ర! నీ తండ్రి సత్యంబుఁ గాపాడఁగా నెంచి, ఘోరాటవుల్ చొచ్చి, దైత్యాళిఁ జెండాడి మా బోంట్లకున్ సంతసంబున్ సతంబున్ బ్రపంచంబునన్ భద్రముం గూర్పవే, సర్వలోకాశ్రయ శ్లోకనామా! సునామా! నమస్తే, నమస్తే, నమః.

దశరథనందనా! శ్రీరామచంద్రా! ఎంతయు ధన్యులము! మా కోరిక లీడేఱినవి. క్రూర రాక్షసవధంబు అందఱుఁ జేయఁగల కార్యమా? సుధీర! ఈ కార్యము నిమిత్తమై నిన్నిందు రావేఁడిన పురందరుండు శరభంగాశ్రమమున కరుదెంచి యున్నాఁడు!

రాము—మునీంద్రులారా! నన్నింత పెద్దఁజేయఁ దగునా?

మత్త. తాపసోత్తములార మీరలు • దండకాటవియందునన్
కాపురంబును సల్పుఁడీ కల • కాలమున్ గడు భక్తి; సం
తాపకారకులై చెలంగిన • దానవుల్ ధరఁగూలుటల్
ఏపు మీరెడు భక్తితో నిఁక • నీశ్వరున్ భజియింపుఁడీ.

ఋషిచంద్రములారా! మీరింక నిశ్చింతతో హిత కృత్యములను జేయుచుండుడు. మనమింక పాకశాసనునిం జూడం బోవుదము రండు.

(ఋషులు, శ్రీ రాముండు నిష్క్రమింతురు)

—◆◆◆ ప్రవేశము : ఇద్దఱు గంధర్వులు ◆◆◆—

ప్ర. గంధ—ఆహా! ఈ శ్రీరాముని పరాక్రమమెంత స్తవ నీయమైనది! ఒక్కండే సాహసించి, ఎట్టివారికినిం జంప సాధ్యముగాని ఖరదూషణాది క్రూరరాక్షసులను జంపుటయేంగాక, ఇందఱిని నిహతులం గావించెనే! ఔరా! ఎంత సాహస మెంత సాహసము!

ద్వి. గంధ—మిత్రమా! అచ్చెరువేల?

తే. గీ. వినమె మిత్రమా! మున్ను మహా • విష్ణుమూర్తి
నుడివినది యెల్లం, గాంచ, ని • తండు, నతండె
యనం బరాక్రమమున హరి • యంతం దోంచె;
నయ్యొ! యనుమానమేల? స • త్యముగ నితండు
హరియె! శ్రీరామ మూర్తిగ్రు • యవతరించె.

ప్ర. గంధ—నిజము, నిజము. రామావతారమెత్తి, రక్కసుల రూపుమాపునట్లుం దెల్పి యున్నాండు. (అటు నిటు విలోకించి) అయ్యో! ఎందో దుందుభివాద్యము వినవచ్చుచున్నది. శరభంగాశ్రమమున నై యుండును. రమ్ము పోవుదము.

( పై కెగసి, నిష్క్రమింతురు )

(శూర్పణఖ: చెట్ల గుంపులోనుండి ప్రవేశించును)

శూర్ప—ఇఁక తీఱినది! ఇంకేమి చేయఁగలదానను? ఇఁక తడవుసేయక రావణుని కడకేగి, యీ వార్తఁదెల్పి అతనిని బురికొల్పెదను (నిష్క్రమించును).

(అంత, అకంపనుఁడు ప్రవేశించి)

అకంప—(నిట్టూర్పు విడిచి) అబ్బా! ఎట్లైనను ప్రాణము గాపాడుకొంటిని! అయ్యయో! ఎంతపాటుఁ జూడవలసి వచ్చినది. అంతయు నిర్మూలమైనది! మా సైన్యమంతయు మంటిలోఁ గలిసినది. మహా వాయువేగంబున నేలఁగూలు మహీరుహంబుల పగిది మా రాక్షస సైన్యమంతయు ఈ రఘువీరుని శరప్రహారములం దెగి, నిశ్శేషమై పడి సెను. ఇందఱిలో మిగిలినవాఁడను నేనొక్కఁడను! మా తల్లి పుణ్యమాయనుచు, బ్రతికిపోయితిని! ఏ కారణము చేతనో శ్రీ రాముఁడు నన్నుఁ జూడలేదు. నేను దప్పించు కొనుటఁ జూడఁగా, మా రాక్షసరాజునకు ఏదో కొంత మేలు కలుగున ట్లున్నది. ఇఁక నే నిందాలస్యము చేయక శరవేగమునఁ బోయి, యిక్కడ జరిగిన యావద్వృత్తాంతము మా దశకంఠునితోఁ దెల్పెదఁ గాక! (పరుగెత్తును)

# సీతాపహరణము.

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము

[రావణునిమందిరమున నాట్యము.]

[ప్రవేశము:—అకంపనుఁడు: రావణుఁడు మైమఱచి యుండును.]

అకంపనుఁడు—చెప్పవలసిన యంతయంతయుఁ జెప్పితినికాని కామోద్రేకియై మైమఱచియున్న రావణుఁడు నా మాటలు వినియు వినకల్లె విన్నాఁడు. నేనేమి చేయుదును? ఇఁక హెచ్చుగఁ జెప్పఁజూచిన అతఁడూరకుండఁడు. అదిగో! శూర్పణఖ ఇట్లు వచ్చుచున్నది. స్వతంత్రురాలుగావున నామెయే నాపనిఁ జేయఁగలదు. నేఁ బోయెదను.

[ప్రవేశము:—శూర్పణఖ]

శూర్ప—(స్వగత) ఔర! ఇట్లున్న దీతని వైభవము చెప్పి చూచెదను. (దగ్గఱకుఁబోయి) సోదరా! ఏమి యీపని! త్రైలోక్య భయంకరుఁడవగు నీ విట్లుండఁగా లోక మల్ల కల్లోలము గాదా?

రావ—చెల్లెలా! ఎప్పుడు వచ్చితివమ్మా? వార్తో సేమయినఁ జెప్పవచ్చితివా?

శూర్ప—అన్నా! ఊరక చెప్పుటకేగాదు. ఏమని చెప్పుదును? ఒక్క వీరుఁడు వేనవేల రక్కసులను నుక్కడంచెను. శూరత్వమన నదికదా?

రావ—చెల్లెలా! ఏమది? ఎవ్వఁడు! ఎవ్వరిని? తిన్నగ వచింపుము.

శూర్ప—సోదరా.! ఏమి చెప్పఁగలను? ఎంతటివాఁ డెంతటివాఁడు! ఒక్కఁడే జనస్థానమునెల్ల నాశ మొనర్చెను. అంతయుఁ బాడుచేసెను. నీవన్ననో వచ్చియుండు మహానేను తెలియకున్నావు!

రావ—సోదరీ! ఎవరి జనస్థానము నెవఁడు పాడొనర్చె? అట్లుగావించిన వాని నామమెద్ది?

శూర్ప—అన్నా! అతఁడు క్షత్రియుడఁట. రాముడఁట!

రావ—ఏ రాముఁడు? పితృనామ మెఱుఁగుదువా?

శూర్ప—అన్నా!

సీ. అతిసమర్థత నయో • ధ్యను నేలి మించిన
దశరథుండాతని • తండ్రియనియె,
తల్లి కోరికఁదీర్ప • తండ్రియానతి వలఁ
దాల్చి తాపసవృత్తి • దాల్చెననియె;
నిముసంబు తనుబాయ • నేరని తమ్ముండు
భార్యయుఁ దనతోడ వచ్చిరనియె;
పదునాలుగేఁడులు • వనములందుండియు
పయి రాజ్యమున కేగు • వార లనియె;

గీ. యావనులు! సాహసులును స ◆ ద్భావయుతులు!
మునుల శ్రేయము గోరి కం ◆ కణముఁ బూని
అసుర సంతతి నెల్లఁ జెం ◆ డాడుచుండ
నేమియు నెఱుంగకున్నాఁడ ◆ వేమనందు!

రావ—తెలిసెను, తెలిసెను. చెల్లెలా! అతనితో వైరము దెచ్చుకొనిన వారెవరు?

శూర్ప—వైరకారణము గూడఁ దెలియదా? నీకెట్లు తెలియఁ గలదు?

ఉ. స్త్రీసుఖమే సుఖం బను వి ◆ శేష విచారనిమగ్నుఁడై యనా
యాసముతోడఁ జొక్కు రప ◆ రాంగనలన్ గొనితెచ్చి చాల సం
తోసమునొందు టొక్కటియె ◆ తోఁచినదా? యిఁక రాచకార్యముల్
చేసెడు చింత సుంతయును ◆ లేదె? నిశాచర సోదరాగ్రజా!.

ఏ వేళఁ జూచినను కామ సుఖానుభవములందు మనసు దూర్చినట్టి నీకు ప్రజల సుఖదుఃఖములు గూడఁ దెలియునా? ఔరా! ఎంత మందమతివై యున్నావు! ప్రజల సుఖ మెఱుఁగని ఱేఁడవు. నిన్నెవరు సరకు చేయుదురు? ఏ నృపాలుఁడు సమయోచిత కార్యము లొనర్పఁడో వాఁడు రాజ్యభ్రష్టుఁడు గాక తప్పునా? వేగులను నియమింపక, పరరాష్ట్ర వృత్తాంతంబుల నెఱుఁగక, జితేంద్రియుఁడుఁ గాక సర్వదా స్త్రీసుఖములందు ఆసక్తిఁగల ఱేఁడు ఱేఁడా? అట్టివాని సిరి మూనాళ్ళ పట్టపగలై పరిణమింపకుండునా? రాజలక్షణము లరయవలదా? ఏ నృపాలుఁ డింద్రియములఁ గెల్చి, నెనరుఁ గలిగి పుణ్యకార్యము లొనర్చునో అతఁడు చిరకాలము సౌఖ్యమొందఁ గలఁడు. అట్టి ఱేఁడు కన్నులు

మూసికొని యున్నను నీతి నేత్రములచే అన్నింటిని చెన్నార నెఱింగి సర్వకార్యములను నిర్వర్తింపఁ గలఁడు! నీవన్ననో, లఘుబుద్ధులగు మంత్రులఁగూడి, యథోచిత కార్యక్రమమెఱుంగక నీళ్ళు నమలుచుఁ గాలముఁ బుచ్చుచున్నావు! ఔరా! ఇంత యన్యాయమా? జనస్థానంబున నడచిన మహానర్థంబునైన నెఱుఁగ వయితివా? ఎట్లెఱుంగుదువు?

తే. గీ. పేరునకు రాజు; వాని వి • స్తార కీర్తి
ధర్మరతుఁడైన మంత్రి స • త్తముని సొత్తు;
నీ యమాత్యులెల్లరు నవి • నీతులగుట
రాజ్య నాశనమునకు మా • ర్గంబుగనిరి.

నీ యమాత్యులను బోలువారు లోకమున మఱి యెందు నుండరు. ఏలయన, వారు మిక్కిలి విపరీతబుద్ధులు, అవివేక సంపన్నులు. లోకమున—

గీ. వివిధ విద్యా విశారదుల్ • విమలమతులు
సత్యశౌచాది సద్గుణ • సాంద్రయశులు
ధైర్య శౌర్య ధుర్యులు; రాజ • కార్యరతులు
సుప్రసిద్ధులునై మించు • నూరిజనులు
మంత్రులై యొప్పుటే సుమీ • మానితంబు.

కావున ఇప్పుడైనను మున్నెఱింగి యొప్పగు చొప్పున కార్యములు చేయఁ బ్రయత్నింపుము.

రావ—సోదరీమణీ! నీ యుపదేశ మమోఘము! మంచిది. వైరకారణముఁ బేర్కొన నైతివేల? వారై మనవారల డీకొనిరా? లేక మనవారే వారినిఁ దాఁకిరా?

శూర్ప—అన్నయ్యా! ఎవ్వరెవ్వరి నెదుర్కొనిరో నాకుఁ దెలియదు. కాని మహావధవిషయమై యెఱుంగుదును.

రావ—చెల్లెలా! ఇంక నేనిందు నిలువఁ జాలను. అపరాధమె వరిదైనను సరియె; శత్రువెట్టి యమాయకుఁడైన సరియె; శత్రులని యెఱిఁగినవారి నందఱను రూపు మాఁపెదను. ఈకార్యము నిమిత్తమై యొరులను బంపను. నేనే స్వయముగఁ బోయివచ్చెదను. (అని లేచిపోఁబోవ)

శూర్ప—సోదరా! కొంచె ముండుము; ఎవరో, ఎందున్నవారో, ఏమిచేసిరో ఏమైన నెఱుంగుదువా? ఎవ్వరిపైఁ జంపి వచ్చెదవు? మనకు శత్రువులు కానివా రెవరు? కావున కొంచెము శాంతించి, ఎవరెవరు మడిసిరో విచారింపుము. పోనిమ్ము; మన తోఁబుట్టువులలో నెవరు మృతినొందిరో తెలియునా?

రావ—ఏమి! తోఁబుట్టువులలో!…… …… ……(విస్మయ మంది లేదని తలయూఁచును).

శూర్ప—మొదటి సైన్యంబున మనసైనికు లనేకులు రామ బాణాగ్నిలో మిడుతలవలెఁ జచ్చిరి! తరువాత ఖరదూషణాది సోదరులు గూడ కయ్యంబునఁ జేరి, ప్రాణములఁ గోల్పోయిరి!

రావ—ఏమి! ఖరదూషణులు మృతినొందుటయా? అక్కటా! సోదరీ! ఇట్టి ఘోరవార్తను వినియు, నే నేరీతిని మనఁ గల్గుదును! ఈ వైరమున కంతయుఁ గారణమేమి?

శూర్ప—సోదరా! ఇంతయేఁ గాదు! ఆ రణరంగమున నడచిన మహావధను జూచి దేవతలేగాక, మునీంద్రులు సైతము సంతోషభరితులై, ఆ విచిత్రవీరుని దీవించి వెడలిరి!

రావ—ఏమేమీ! సుర మునీంద్రుల కింత కావరమా! వాహా ఆ సాహసుని శక్తికి మెచ్చి దీవెన లొసఁగు మహామహులు? నేనును జూచెదను! ఆహంతకుని పరాక్రమము! ఆ దేవతల దీవెనల మహిమయు!

శూర్ప—సోదరా! శత్రువు నంత పెద్దఁ జేసినందుకు నన్ను మన్నింపుము. నిక్కము వక్కాణించితిని. మన సాహస విషయ మట్లుండనిమ్ము! రాముని పరాక్రమము నా గుండియ లవియఁ జేసినది. అందఱ నొక్కఁడై చంపిన యాతని సాహసమెట్టిదో నీవే యూహింపుము. అందఱు రక్కసులే గాదె, నీవు నేనన నెంత! ఒక్కఁడవై నీ వేమి చేయఁగలవు? వలదు, వలదు. నామాట వినుము. నేను జెప్పిన ట్లొనర్చితేని, రామవధ అతి సులభము. రామ లక్ష్మణులు చచ్చుటయేఁ గాక, నీవు నుదియొక అద్వితీయ ప్రతిఫలము లభించును.

రావ—సోదరీ! నీ యభిప్రాయము చొప్పునఁ గావించెదను. ఔరా! ఇట్టి చెడ్డకార్యము నాచరించు వాఁడును గెలుఁడా? పుట్టినాఁడే నను ప్రాణములతోడ మనఁగలఁడా?

సీ. బ్రహ్మాండ భాండంబు • భస్మంబుఁ గావించు
మార్తాండునుం బట్టి • మద మడంతు;
సకలమ్ము నెగఁజిమ్ము • సర్వత్ర వ్యాపించు
వాయువు నణచేతఁ • బట్టనైతు;

జీవరాసుల భీత • చేతనుక్కలం జేయు
యముఁడు నా యనుచరుం • డై వసించు;
తారకాగ్రహమెల్ల • ధరణిఁ గూలఁగఁ గజ
గజ వణకించు ద • నుజాఁడ నైతి;
గీ. తక్కుఁగల దేవతలు నాకు • దాసులైరి
వసుధఁగల రాజు లెల్ల సే•వకులునైరి
యిట్టి నాకుఁ నా బంధుల • కగ్గుఁ దలఁచి
ప్రాణములతోడ భువి మను • వాఁడుఁ గలఁడె ?

ఇట్టి పరాక్రమశాలినైన నా కపకీర్తి ఘటించిన యా ఖలుఁడు, ఆ దుర్వినీతుఁడు, ఆ మూర్ఖమానవుఁ డెచ్చట నున్నాఁడు ?

శూర్ప—అన్నా! రావణా! ఇట్లు సాహసించుట తగదు. ఒక్కమాట వినుము. చేతఁగానివాఁడ వనికాదు. నీ సాహసాదులు నే నెఱుఁగనివా? చొరరాని సర్పరాజనగరంబున కరిగి తక్షకుని శిక్షించిన బలంబును; సెబాసన కుబేరుని విమానమును దెచ్చిన బలంబును ఇంతలో మఱచితి ననుకొంటివా? శూరశిఖామణివగు నీ యత్నమును భగ్నము గావించితినని తలఁపకుము. పరస్థలములందు స్థానబలిమియుండదు. నీవే దండకారణ్యముఁ బ్రవేశించితి వనుకొనుము. పూనిమ్రుచ్చులే నీకేదేని హానిఁ జేసి రనుకొనుము. అట్టి సమయమున నీవు మాత్ర మేమిచేయఁగలవు? ఏమో ఎవరికాల మెట్లున్నదో మన మెఱుఁగము గదా! మహాబలుఁడే అబలమాడ్కి మెలంగుటయుఁ గలదు. జయాపజయములు నిర్ణయింపలేముగదా? ఇట్లుం

డఁగా నీ వీ కార్యమున కియ్యకొనుట నాకు లెస్సఁగఁ దోఁచదు.

రావ—శూర్పణఖా ఏమంటివి ? నాకపజయమా ! కైలాస గిరి వాసుఁడగు పరమేష్ఠి యొసఁగిన వరములన్నియు బుగ్గిఁ గలియునా ? వీరహోమప్రీతుఁడైన పితామహుని వరములు నీటఁ గలియునా ? పోనిమ్ము. మఱి ఏ విధ మాచరించుట లెస్స యనెదవు ?

శూర్ప—రామునితోఁ బోరుటకంటె, ఈ తీరునఁ జేయుట యుత్తమమని తోఁచుచున్నది.

రావ—ఎట్లు ?

శూర్ప—అట్లు చేయుట నీ కత్యంత సంతోషమే యని నే నెంచెదను.

రావ—సంతోషమేయైన మఱింత నేర్పుతోఁ గావించెదను. అది ఏమి ?

శూర్ప—అట్లు గావించిన అమూల్యాభరణ మొక్కటి నీకుఁ జిక్కఁ గలదు.

రావ—మఱింత సంతోషము; చేయవలసినదేమి ?

శూర్ప—(ఊరకుండును.)

రావ—చెల్లెలా ! ఎట్టిభేదమును ఎంచవలదు. అది యెట్టి విషయమైనను సరియే, చెప్పుము.

శూర్ప—సోదరా ! పల్కుటకు నోరాడకున్నయది. అయినను తోఁబుట్టు వగుటచే నీ యెదుర సిగ్గువిడిచి నుడివెదను. కార్యసాధనకై చౌర్యవృత్తి యెట్టి ధైర్య స్థైర్యములు

గలవారికైనను అవలంబింపఁ దగినదే కదా? ఇప్పుడు మనపని యసాధ్యమని తోఁచినను కష్టసాధ్యమని నాకు మాత్రము తోఁచుచున్నది. అయినను ఒకవేళ సమయము పడనేని నీవు చౌర్యవృత్తికి సమ్మతించెదవా?

రావ—సమ్మతించినను వమ్ము వాటిల్లదనియే నా యభిప్రాయము. శూరాగ్రేసరు లనేకులు సమయానుకూలముగ చోరులగుట వినియున్నాను. సరియే; ఇప్పుడు దొంగతనముతో నేమిపని?

శూర్ప—నీ వట్లు ప్రశ్నించెదవనియే నేను సంశయించి చెప్పనయితిని.

రావ—లేదు, లేదు. చెల్లెలా! సరే; చెప్పవలసినదంతయుఁ జెప్పుము.

శూర్ప—నీకు స్త్రీలఁ నెక్కువ ప్రీతి. రాక్షస స్త్రీలనే నీ వింత మక్కువతోఁ జూచుచున్నావే, ఆ రాముని భార్యయగు సీతను జూచిన నే మందువు?

రావ—[కుతూహలుఁడై] అయిన నేమిచేయుమనెదవమ్మా?

శూర్ప—సోదరా! అదియును నేఁ జెప్పవలయునా? యుక్తాయుక్తముల నెఱిఁగిన నీ కంతమాత్రము స్ఫురింపకున్నదా? ఏమియు లేదు, ఆమె లావణ్యాతిశయ మింతయని చెప్పితిని.

రావ—ఆహా! అంతటికాంతయా? [యోజించి స్వగత] నిక్కము! నేను పూర్వము ఒకప్పుడా యొప్పులాడినిఁ గాంచియుంటిని!

శూర్ప—(తనలో) అన్నియు మఱచి, మోహసముద్రమునఁ బడిన ఈతని మఱింత యువ్విళ్లూరఁ జేసెదను. (పైకి) సోదరా ! నామాట లతిశయోక్తు లనుకొనకుము.

గీ. చంద్రుని హసించు నెమ్మోము • సొగసుతోడ
మెఱుఁగుఁ దీఁగెను మించెడు • మేనితోడ
ఇరులఁ గేరెడు నిడుదలౌ • కురులతోడ
భువనమోహినియో యన • సవురుఁ దోఁప
ముద్దు గులుకుచు నున్నదా • పొలఁతి మిన్న.

క. ఆ కాంతను నా బోఁటులు
సాకల్యము గాఁగఁ బొగడఁ • జాలుదురే ? మూ
ల్లోకముల నామెఁ బోలిన
రా కొమ్మనుఁ జూచి యెఱుఁగ • రాక్షసరాజా !

సోదరా! ఆమె వయోరూపములును, ఆమె యద్వితీయ విలాసగరిమయు, నామె లావణ్యాతిశయమును జూచినచో, ఆమెకు సాటివచ్చువారు నాకెందును గన్పింపరు ! ఆమె కామెయే సాటి ! నేనును రతి, రమ, శచి, భారతి మున్నగు సతీమణులను పెక్కురను జూచితినిగాని, వారియందఱి రూప రేఖావిలాసములు ఒక్కచోఁ జేరి, ఆ సీతయందు మూర్తీభవించి యున్నవన్నచో నతిశయోక్తికాదు ! ఆహా ! అంతటి వదినెగారు నాకు లభించునా ? ఆ యువతి, ఆ కుందరదన, ఆ బంగారు బొమ్మయే నీ భార్య యగునేని ఇప్పటి నీ మంద బుద్ధి తొలఁగఁ గలదు. నిన్ను హాయిగఁ గూర్చుండఁబెట్టి ఆమెయే నీ కొఱకు రాజ్యమేలఁ గలదు.

రావ—శూర్పణఖా! ఆ సీతను నేనును ఒకపరిఁ గాంచి యుంటిని. ఆ మందయాన సౌందర్యమును నేను నెఱుంగుదును, కాని దానిని దెచ్చుటెట్లు ?

శూర్ప—అన్నా! నిజముఁ జెప్పెదను. నీకు సీత విషయమేమియుఁ దెల్పకయే నేనే యామెతో మంచిమాటలాడి నీయొద్దకుఁ దోడుకొనిరావలెనని ప్రయత్నించితిని. కాని, అట్లు చేయుచుండఁగా లక్ష్మణుఁ డనువాఁడు అత్యంతాగ్రహచిత్తుఁడై నన్నిట్లు కురూపిం జేసి పంపెను. (అని ముఖముఁ జూపి) అన్నా! గాటులు మానిసవి. పోనిమ్ము! ఆ మాట లేల! మచ్చెకంటిం దెచ్చు విషయము ముచ్చటించెద వినుము. వారు దండకలో పంచవటీ ప్రాంతమున నున్నారు. నీ వచ్చటికేగి యందున్న సీతను బలాత్కారముగా నెత్తుకొనిరమ్ము. ఇట్లొనర్చెదవేని రాముఁడు సీతను బాసి, ప్రియంబాసిన దుఃఖముచే జీవము విడువఁగలఁడు. ఇట్లయ్యెనా రాముఁడు మృతి నొందుటయు నీతలంపీడేఱుటయు, పైని సీత లభించుటయు సంభవించును. లేదా నీకు శక్తి కలదేని సీతనుదెచ్చి యటుపై రామలక్ష్మణులను నుక్కడంచి రక్కసులకుఁ బ్రీతి యొనర్పుము. తరువాత నింద్రవైభవ మనుభవింపుము; చెల్లెలను; చెప్పవలసిన దానను గానఁ జెప్పితిని. తరువాత నీ యిష్టము.

రావ—సోదరీ! నీ మాటలు యుక్తియుక్తములై సయుక్తములుగఁ దోఁచుచున్నవి. తప్పక నీ విప్పుడు చెప్పిన చొప్పునఁ గావించెదను. (సేవకునిఁ జూచి) ఓరీ! ఎవఁడురా ద్వారమున ?

ఈ విషయమున మారీచుఁ డేమైన సాయపడునేమో చూచెద !

సేవకుఁడు—(ప్రవేశించి) మహాప్రభూ ! సెలవిండు.

రావ—ఓరీ ! త్రైలోక్యదక్షుండగు నీ రాక్షసేశ్వరుండు గోకర్ణాశ్రమ విలోకన కుతూహలుండై యుండెననియు, తన్నిమిత్తము తత్క్షణము గూఢగతి తాను నా సౌధమునకు రావలెననియు నా యాజ్ఞగా నా సారథితోఁ దెలుపుము; పొమ్ము.

సేవ.—చిత్తము (నిష్క్రమించును).

శూర్ప—సోదరా ! మఱియొక మాటఁ జెప్ప మఱచితిని. మారీచుఁడనఁగా జ్ఞప్తికి వచ్చినది. సీతను దెచ్చుటయందు మారీచునకన్న మిన్నగఁ దోడ్పడఁగలవారు వేరెవ్వరును లేరు. సీతాపహరణమునకు మారీచ మాయయే లెస్సయని తోఁచుచున్నది. ఎట్లన, సీతకు జింకలయందు మిక్కిలి ప్రీతి. బంగారు రంగుఁగల మాయా కురంగవేషమున మారీచుఁ డాయంగనను తన వశముఁ జేసికొనంగలఁడు. అంత నా మృగమునకై సీతయు, తన భర్తను వేఁడుకొనును. మృగయార్థమై రాముఁ డరుగుతఱి, నీవు సీతను దెమ్ము. ఇట్లు, చేసినచో నీ మనోరథ మీడేఱును. కావున, మారీచునితో నా విషయ మేమాత్రము దెల్పవలదు. తెలియఁజేసిన ఆశాభంగము కలుగక తప్పదు. ఏమియుఁ దెల్పకున్న అన్ని విధముల నాతఁడు దోడ్పడఁగలఁడు. ఈ విషయమునఁ దగు జాగ్రత్తగా నుండుము.

రావ— (తలయూఁచుచు నిష్క్రమించును.)

(తెర జారఁగా కొంచెము ముందునకు నడిచి)

ఔరా ! ఇప్పటికి ధన్యురాలనైతిని. చెలిమిని చేఁదుమేప వచ్చునుగాని, బలిమిని పాలుఁద్రావింపలే మనుట నిక్కమయ్యెను. ఎట్టి విషయమును జెప్పినను పెడచెవిం బెట్టెడివాఁడు కాలవశమున నీతఁడు నేఁడిట్లు నన్ను పెద్దఁజేసి మిక్కిలి సన్మానించెను. కాని, యితఁడు మాత్ర మేమిచేయఁగలఁడు ? లేనిపోని పనిఁబెట్టుకొని ముక్కు చెవులు గోయించుకొంటిని. చింతించిన మాత్ర మేమి కలదు ?

తే-గీ. వెనుకయును ముందుఁజూడక • విఱ్ఱవీఁగు
కతన సంభవించెను గీడు; • కాన మదిని
వ్యసనమొందినఁ గలదె లాభంబు, తలఁప
ముందు వెనుకల నరయరు • మూర్ఖులెపుడు.

(నిష్క్రమించును)

## ద్వితీయ రంగము.

[మారీచుని కుటీరము]

మారీచుఁడు—(అటు నిటు విలోకించి) ఔరా ! ఏమి యీ విచిత్రము ! మా రాక్షసరాజు నేఁడిట్లు నా యాశ్రమమునకు వచ్చుటకుఁ గారణ మేమైయుండునోకదా !

(సమీపించును)

(రావణుఁడు ప్రవేశించి)

రావ.—సచివాగ్రణీ! మారీచా! అభినందనములు.

మారీ—రాజచంద్రా! నమస్కారములు. ఈప్సితఫలసిద్ధిరస్తు.

గీ. రాక్షసేశ్వర! శుభమెగా • రాజ్యమందు,
నీదు ప్రజలెల్ల క్షేమంబె • నీదు హితులు?
భూరి బలయుతుఁడగు నీదు • శూరతకు; జ
గంబు జోహారు సల్పుచుఁ • గ్రాలుచున్నె?

ఱేఁడా! త్రైలోక్యనాథులగు మీ రిచ్చటకు స్వయముగ వచ్చిన కారణము నే వినఁ దగుదునా?

రావ—అంతయుఁ దీఱెను! మారీచా! విని, సంతసించున దేమియు లేదు! ఒక్క మానవ మాత్రునిచే నా యన స్వసామ్రాజ్య ప్రతాప కోలాహలము నేఁటితో నీటఁ గలిసెను! ఏమని చెప్పుదును.

ఉ. వారిత ప్రతాప శర • పంచయ సృష్టి పరంపరన్, భుజా
సారము మీఱ సోదర, ని • శాచర వారముఁ గ్రుంగఁ జేసి, వి
స్ఫారిత తేజుఁడై, తపసి • వర్గము గావన, దానవప్రతీ
కారవిహారయుక్తిన్ సలుపు • కంకణబద్ధునిఁ గూర్చి వింటివే?

మారీ—ఱేఁడా! ఏ మిట్లాడెదరు?

ఉ. ముక్కడి మానవుండొకఁడు • మూర్ఖత మిమ్ముఁ బరాభవించెఁగా
(నగుచు) ఎక్కడి మాటలాడెదరు? • ఎవ్వరికైనను నమ్మసాధ్యమే?
ఎక్కడనైన వింటిమొ? మ • రెందున నైనను గాంచి యుంటిమే?
నిక్కముబల్కుఁడయ్య ధర • ణీశ్వర యున్న తెఱుంగు సర్వమున్.

రావ—మారీచా! ఏమని చెప్పుదును. అనివార్య శౌర్య ధుర్యులగు నా పరివారజనశతానేక మొక్కమారు మడిసెనఁట! సోదరులగు ఖరదూషణాదులుగూడ మృతినొందిరఁట!

మారీ—(నివ్వెఱపాటుతో) ఏల! చంపినవా రెవరు? నే నమ్మను.

రావ—ఎవఁడో మహామునులకు మేలొనర్చువాఁడఁట! దశరథ నందనుఁడఁట! సతీ సోదరయుతముగ, తండ్రి పనుపున, కాననాంతరమున సంచరించుచున్నాఁడఁట! తెలిసెనా! రాముఁడఁట!

మారీ—(రామ నామము విని. వెఱఁగొందినట్లు నటించి, హృదయముపైఁ జేయినైచుకొని వణఁకుచు) రాముఁడన నాకు దడ పుట్టుచున్నది.

కం. అయ్యయ్యో! ఎందుఁ జూచిన
దయ్యమువలెఁ గానుపించె • దశరథ రాముం
డయ్యో! అస్త్రము పైఁబడె!
నెయ్యెడ దాఁగుదును; గాతు • రెవ్వారు ననున్?

(నేలఁ గూలును.)

రావ—మారీచా! ఏ మిట్లున్నావు? (అని వీఁపుఁ దట్టుచున్నాఁడు.)

మారీ—(వణఁకుచు మిన్నకుండును.)

రావ—(తట్టుచు) ఏమి?

మారీ—(వెఱ్ఱివానియట్లు ఇటు నటుఁ జూచి) ఏమున్నది?

రావ—ఇప్పు డేదో దయ్యాము గనుపడె నంటివే ?

మారీ—చూచితిని.

రావ—ఏమి చూచితివి ?

మారీ—దయ్యమును !

రావ—ఆ దయ్య మెట్లుండునో చెప్పఁగలవా ?

మారీ—ఏమని చెప్పుదును ! పూర్వము ప్రహ్లాదుఁడు పల్కినట్లు, ఎందుఁ జూచినను ఆ దయ్యమే కనఁబడుచున్నది. అది మగదయ్యము. ఇంతకు పూర్వము నీవు పల్కినదే.

గీ. ఇందుఁ గల డందు లేఁడని • యెన్న నేల ?
ఎందుఁ జూచిన కౌసల్య • నందనుండె !
కాంచ నా కంటి కాతఁ డొ • క్కరుఁడు దక్క
అన్యుఁ డెవ్వాఁడుఁ గన్పింపఁ • డయ్య యిచట !

ఉ. భూరి ధనుస్సు చేతఁగొని • పొల్పెసలారు మృగాజినంబు మేల్
చీరము గాఁగఁ దాల్చి, ప్రతి • చెట్టునఁ గన్నులఁ గట్టినట్టులన్
సారెకుఁ బాశహస్తు నటు • సర్వ మయుం డయియున్నవాఁ డనన్
శ్రీ రఘురామచంద్రుఁడు వి • చిత్రముగాఁ గనుపించు నెల్లెడన్.

క. కలలోన నైన రాముఁడె
విలు చేతంబూని నన్ను • వెఱపించినటుల్
పలుమాఱాతనిఁ గని రా
త్రుల నిద్దుర లేక యుందు • దును నే నకటా !

మఱియు,

గీ. 'రా'యనెడు శబ్దమాదినిఁ • గ్రాలునట్టి
రణ రథాదిక శబ్దజా • లములు విన్న

ధీరుఁడగు నాడు నిలువెల్ల • నీరమగుచు
వసుధఁ గూలును జీవచ్ఛ • వంబు పగిది.

అను రేశ్వరా ! వేయేల ! రేఫాద్యంబైన నీరావణ నామము వినుటకు నాకు మిక్కిలి భయము గలుగు చున్నది!

రావ—మారీచా! భయపడకుము ! ఏలనయ్యా ఇంత పిఱికి వాఁడ వైతివి ? హరిహరాదులకుఁగూడ బిరుదుమగం డగు ఈ సురారిశేఖరుని పరమ మిత్రుండవగు నీ కిట్టి వెఱపు పాడియా ? భయపడకుము. నా బొందెలో జీవుఁ డుందువఱకు నీ కెట్టి యిక్కట్టును గలుగఁ జాలదు. ఇప్పుడు మనయొక్క పరిభవమునకుఁ బ్రతికూలముగ నే నొక కార్యముఁ జేయఁదలంచితిని. బవరంబున వేల్పు లంద ఱొక్కుమ్మడి మనపైఁ బడినను నరకుఁగొనక, నీవును, నీతోఁబుట్టువులును నాకుఁ దోడ్పడవలయును.

మారీ—రావణేశ్వరా ! సహాయమున కేమి ? ఎట్టి కార్య మును జేయఁ బూనితివి. (మాటలు తడఁబడుచు) వైరమ కాదుకదా ?

రావ—మారీచా ! అట్లంటివేల ?

మారీ—ఒకసారి అనుభవమైనది; కావున నట్లంటిని.

రావ—ఏ మైనది ? సుఖముగ నున్నాఁడవే!

మారీ—నీ వెఱుఁగనిదికాదు. అయినను, జెప్పెదను. నీవు తెల్పిన రాముని నేను బాగుగ నెఱుంగుదును. అతఁడు బాలుఁడై యుండునప్పుడు విశ్వామిత్రుని యాగమును

రక్షించుటకై వచ్చి, యాగ భంగార్థమై వెళ్లిన నన్నును, నా సోదరుఁడగు సుబాహువును జచ్చునట్లు గొట్టినాఁడు. ఆగ్నేయాస్త్రప్రయోగముచే సోదరుడు చావఁగా, వాయవ్యాస్త్ర ధాటికి నే నేదో యొకవిధముగ విధివశమున పులినోరికండ విడివడ్డచొప్పునఁ దప్పించుకొని, ఈ నాఁటి కీ స్థలముఁ జేరితిని. ఇప్పటికిని అతనిం దలంచిన నా గుండె చెరువగుచున్నది.

రావ—మారీచా! నీ పల్కులు నిక్కమే యగుఁగాక. ఇప్పుడు వైరముతోఁ బని లేదే!

మారీ—అయిన నేమి చేయఁదలఁచితివి?

రావ—ఈ విధముగా! వినుము. సీతారాములు ఒంటొరుల నెడఁబాయునట్లు, ఈ కార్యమును జేయుటకు నీవుదక్క నుఱొక్కఁడు నిక్కంపు నేర్పరి నాకుఁ గానరాఁడు.

మారీ—రాజా! నీకు మ్రొక్కెదను. మఱి యే విషయమున నైనఁ దోడ్పడెదఁ గాని ఆ రామునితోఁ గలహ మూను పట్ల నేఁ జేయఁగల కార్యము లేదు.

రావ—మారీచా! ఏ మట్లంటివి? చేయవలసిన దతి స్వల్పము.

మారీ—(తనలో) అయినను ఇతని యభిప్రాయము నెఱిఁగెదను (ప్రకాశముగ), ఱేఁడా! ఆ స్వల్పమేమి?

రావ—ఒంటిమై యుండు రాముని భార్యను అవలీల నపహరించుట.

మారీ—ఔనౌను. ఱేఁడా! ఎంతమాట!

చం. దురమున శత్రురాజతతిఁ • ద్రుంపఁగ నేర్చిన దోర్బలుండ; వి
తెలఁగున నాథుఁ బాయని పతివ్రత నొర్తు దయావిహీనతన్
పురుషుఁడు లేనికాలమున • మ్రుచ్చిలి తెచ్చుట శూరనీతియే ?
శరమది లెస్సయే ? పరుల • గాంచిన నవ్వరె ? నిందసేయరే !

రాజా ! ఏ వెఱ్ఱిమొగఁడు నీ కీ బోధ సల్పెను.

ఆ-వె. వైరి నిర్జయుండు • ధీరాగ్రగణ్యుండు
రామచంద్రుఁ డెన్న • రణమునందు;
అతనితోడ నీవు • నన్యాయముగ నిట్లు
వైర మూనుటెల్ల • వగమెకాఁక.

అయ్యా ! నా పల్కులు హాస్యాస్పదములని యెన్నకుము. అతఁడు సాధారణ పరాక్రముఁ డని తలంపకుము. ఇంద్రనందను నంతవాఁడు శ్రీ రామచంద్రుఁడు. విశ్రాంతి నొందుటఁగని సీతాసతీమణిని సమీపించి, రామబాణానలంబున ఆధుఁడైనాఁడు. ప్రబలబలుండగు విరాధుఁ డన్నో జానకీదేవి నెత్తికొనిపోవు ప్రయత్నమునఁ బట్టువడి యమపురి కరిగిన తెఱఁగు నీ వెఱిఁగినదే. ఇఁక ఆతని పరాక్రమమో —

గీ. గాధిపుత్రుని యాగంబుఁ • గాఁచు తఱిని
అన్నదమ్ముల మమ్ముఁ మాటాడినాఁడు !
తాను వారిను తాటకన్ • దండధరుని
వీటికిన్ బంపినాఁడు, దోఃర్వీర్యగుణను !

గీ. ఎవనిపాదరజంబుచే • నిల, నహల్య
జడతఁ బాయుచు నిజరూప • సరణిఁ గాంచె !
ఎవనిభుజదర్పగరిమచే • శివధనుస్సు
ద్రుంపఁబడె లోకజాలముల్ • దొట్రుపడఁగ !

దానవేశ్వరా ! ఆ శ్రీరాముని దోర్బల చారిత్రము అంత మాత్రమే కాదు ! అతఁడు మన రాక్షసకులమును నిర్మూల మొనర్పఁ బుట్టిన విష్ణ్వవతారుఁడనియుఁ బ్రతీతి కలదు !

రావ—ఓరీ !

గీ. సచివుఁ డగు నీవు వాదగు • సౌఖ్యమును
కూర్తు వంచును నీకు, నాకోర్కెఁ దెలుప
నేర్పుతేర్పడ నా మ్రోల • నీచుఁడొకడు
నోరిగాఁ బల్కెదేలరా • తాటకేయ !

మారీచా ! వాని కథ లింకఁ జాలింపుము. రాజు మ్రోలఁ బ్రేలుటయా ? విష్ణువఁట ! విష్ణువైన నేమి ? జిష్ణువైన నేమి ? విష్ణువేయైన మాకు కులవైరి. అట్టివాని భార్యను దొంగిలించుట మాత్రమేకాదు; వాని వంశవృక్షమును మూలముతోసహా నఱికి వేయఁ గూడ నుంకింతును. తెలిసెనా ? చాలును నీ వాక్యములు. వాఁడెంతటివాఁడైనను సరిగా. చెప్పినట్లు చేయుట తప్పదు; వినుము. నీవొక సువర్ణచిత్రిత మృగాకృతిఁ గైకొని, సీతచేరువ నడయాడుచుండుము; నిన్నామె చూడఁగలదు; తన ప్రియునితో నిన్నుఁబట్టుకొన వేఁడఁగలదు; అంత రాముఁడు నిన్ను వెన్నంటి కొంత దవ్వేగిన పదంపడి "హా ! సీతా ! హా ! లక్ష్మణా !" యని రామవాక్యానురూపంబుగా కూఁతవేయుము. రామునికే యాపద కల్గెనో యనుభీతిచేత సీత లక్ష్మణునిఁ బంపును. అట్లు రామలక్ష్మణులు దవ్వున కేగ నేను నా కార్యములు గట్టెక్కించుకొందును, తెలిసెనా ? హుమ్మ్. ఈ కార్యం

బిట్లు నెఱవేర్చి, పిమ్మట విచ్చలవిడిగఁ బొమ్ము. నా రాజ్యంబులోన నర్ధరాజ్యంబు నీకొసంగెద! తెలిసెనా?

మారీ—రావణా! ఎట్టి పాపపుచెయిద మొనర్ప నెంచితివి. అక్కటా! ఏ పాపాత్ములీహితవుఁ గఱపిరి? ఏ కుటిల బుద్ధి నీ కిట్లు బోధించెను? ఏ కూళి, ఏ హీనుఁడు, ఏ ద్రోహి యీరీతి నీతులు గఱపెను. హితాహిత వివేకు లగు నీ మంత్రులు లేనట్లు గలిసిరి?

సీ. నీసుఖంబు కోరని • యీమను జెవ్వఁ డీ
కొలఁగాని పని సేయఁ • గలఁడె వాఁడు?
పురికొల్పరే, లోకమున శత్రువులు జాల
ననుకూలురై యెట్టి • పనులకైన!
ఖలుల వాక్యములు సంకట కారణం బగుచుఁ
దలపోయ కిటు లెంచఁ • దగునె? దాన
అసురసంతతి ధ్వంస • మగు టొక్కటియెఁ బుత్ర
మిత్రకళత్రుల • మృత్యువొకటి

గీ. రాజ్య నాశన మొక్కటి • క్రౌర్య మొకటి
ఇన్ని యన నేల, ఎన్నెని • ఎపుడు నయ్య
హితవు నాలించి సత్కార్య • మతి నొనర్చు
మార్గమును గని వైరంబు • మానుమయ్య!

రాజా! ఏటికి చెట్టుఁగొట్టి పై వేసికొనెదవు? నీ బిడ్డలకు, నీ మంత్రులకు, నీ బంధువర్గమువారికిఁ జేటుఁ దెచ్చు నీ కార్యము నే కుత్సితు లుపదేశించిరి. రావణా! నీవే యట్లు చేసిన—

గీ. నన్నుఁ జంపును నినుఁ జంపు • నిన్నుఁ గొలుచు
దుష్టరాక్షసులను నెల్లఁ • ద్రుంచివైచు

రాక్షసానీకమెల్ల సంగ్రామభూమి
రాముచేఁ జావనున్నారు • రాక్షసేంద్ర!

రావ—ఓసీ! అనుచితప్రసంగప్రలాపా! చాలును నీ యుపదేశము. ఇప్పు డీకార్యమును సేయవేని (కత్తిదూసి) ఇప్పుడే ఇందే నీ రూపు మాపెదను. రాజానకుఁ బ్రతికూలుఁడవై ప్రాణములతో నుండఁగలవా?

మారీ—రాక్షసేశ్వరా! నీ చెడుబుద్ధి వీడుము. సీతను గోరకుము.

రావ—ఛీ! మూర్ఖా! (కత్తిఁదీసి యాతని డాసి) మారా డకఁ బొమ్ము.

మారీ—ఓరీ! "చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతి పిందె" యన్నట్లు నీ కీ దుర్బుద్ధి యెట్లు పుట్టెను? మన్ను మిన్నుఁ గానక నీ విట్లు మంటికి మింటికి సూత్రము పన్నుట వలన లాభ మేమి? సురవైరీ! నిష్కళంకహృదయుండనై చెప్పుచున్నాను. నా మాటలు వినుము. కన్నుల పండువై యొప్పు నీ సిరిం జూచి కన్నుగుట్టిన నీచు డెవ్వఁడో నీ కీరీతి బోధ సల్పియుండునని నమ్మెదను.

ఉ. చంపఁగ నేర్చు నొక్క నిమిషంబున నిన్నును నన్ను నెల్లరన్
ఇంపుగ రాముఁ డొక్కరుఁడె • యేటికి అతనితోడఁ బోర? ఆ
లింపుము నాదు పల్కులను • లేశముగాఁ దిలకింపఁబోకు రా
జ్యంపు వినాశముం గనకు • జానకిఁ దెమ్ము రాక్షసేశ్వరా!

రావ—ఛీ! రాజద్రోహీ! చాలును నీ హితవు.

గీ. నాకవాసులు దేవతా • నీకమెల్ల
వచ్చి యొకమాటె నాపైని • బడినఁగూడ

పూనినటువంటి కార్యంబు • మానుకొంట
పౌసగునె ? రాక్షసేంద్రుండు • మూర్ఖచిత్త !

మారీ—(స్వగత) "వినాశకాలే విపరీత బుద్ధిః" అని యూరకయనిరా పెద్దలు. ఈతని వ్యతిరేకపుటూహలీతని వినాశమును సూచింపుచున్నవి. (ప్రకా.) రాజా ! ఈ మొండిపట్టు నీకుఁ దగదు.

తే.గీ. వలదు సీతను గ్రహియింప • వలదు రాజ !
చెలిమి కల్మిని నీకు నేఁ • జెప్పుచుంటి
పోవ రావంచుఁ బలుకీదు • మూఢునంచు
కాని పలుయంచు, వనితఁ దేఁ • బూనకంచు.

రావ—ఓరీ ! దనుజకుల కళంక ! ఇఁక నిన్ను పేక్ష సేయను. ఇంక మాటపల్కిన నీ జిహ్వ చీల్చివేసెదను. శీఘ్రముగ నడువుము. ప్రాణములు చేఁదా నీకు ?

మారీ—(తనలో) ఇఁక నంతనొందనేల ? ఎన్ని విధముల నీతులను నూరిపోసినను పెడచెవిం బెట్టుచున్నాఁడు. ఏమి చేయువాఁడ ? చెప్పవలసినదంతయుఁ జెప్పి చూచితిని. నన్నీతఁ డూరకవిడువఁడు. కానున్నది కాకమానదు. (ఆలోచించి) ఏమైన నగుఁగాక ! ఈ పాతకునిచేఁ జచ్చుటకంటె పరాత్పరుం డగు శ్రీరాముని కడకే పోయెదను.

(ప్రకాశముగ)

ఉ. దానవనాథ ! క్రూరమతి • దండనఁ జేసెదనంచు మాటికిన్
ప్రాణము దీసె దంచు పలుభంగుల నన్ బెదిరింపనేల ? యీ
ప్రాణము నీటి బుగ్గసుమి ! • ప్రాణముపోయినఁ బోవుఁగాక ! నీ
మానము పోవకుండఁగను • మానితమా యశముండఁ జూడుమా !

ఓయీ! ఎల్లకాలమును ఉట్టిఁగట్టుకొని యూఁగులాడువా రుండరుకదా?

గీ. నీ హితవుఁ గోరి నా నేర్పు • నీకు నెల్ల
నూఁపోసితి; మిగుల ధన్యుండ నైతి;
విన్నపము లెల్ల పెడచెవిఁ • బెట్టినావు;
ఇంక నీ యిచ్చవచ్చిన • ట్లొనఁగుమయ్య!

ఓయీ! రాముఁడు నన్నుఁ జంపక మానఁడు. ఆ పావనుని చేఁ జచ్చి యేఁ గృతార్థుఁడనయ్యెద. నిన్నుఁ బోలు నీచుని చేతఁ బడి చచ్చుటకంటె పరాత్పరుండగు రామబాణానలమున దహించుట వేయిరెట్లు మేలు. అతని చూడ్కి సోఁకినంత నే నొక్కండనే గాదు, పుత్రమిత్రకళత్ర సమేతుఁడవై నీవును దహింపఁబడఁ గలవు. నీ కర్మఫల మిట్లు కట్టి కుడుప నుండఁగా, నీకు నా హితవు చెవికెక్కునా?

సీ. వర పతివ్రతలైన • పరకాంతలను బట్టి
పలుబాములం బెట్టు • పాప మొకటి
బహు తపోధనులైన • పరమభక్తులఁ బట్టి
హింసించు నట్టి దు • ష్కృత్య మొకటి
విమలమానసులైన • యమరముఖ్యులఁ బట్టి
చీకాకుఁ బెట్టిన • చెయిద మొకటి
దుర్వారమైనట్టి • గర్వాంధులై సదా
సజ్జనాదులఁ బట్టి • చంపు టొకటి

గీ. ఇట్టి దుష్కార్యములఁ జేసి • నట్టి ఘోర
పాప మేరీతి నిను విడ • నోపు నోయి!
చేతులారంగఁ జేయు దుష్కృత్యములకు
వగవకుండురె దుర్జనుల్ • బహుళగతుల.

రావ—ఛీ! మూర్ఖచిత్తా! పూర్వానూరూప్యేండ వనుగౌరవముచే ఇంతివఱకు మన్నించితిననియా నీకింత పోతరము. ఇఁక నిన్నూరక విడుచుట కల్ల. ఛీ! ద్రోహీ! పొమ్ము. (కత్తిఁ దీయును) పోవేని, రాముని నిలయమునకుఁగాదు, కాలుని నిలయమునకుఁ బంపెదను. తెలిసెనా? ఈ రెంటిలో నెచ్చోటికేగెదవో నీ యిష్టము! త్వరలోఁ బయనము గమ్ము, పొమ్ము.

మారీ—రాజా! పాపము! నీ వేమి చేయఁగలవు?

గీ. మృత్యుదేవత తలనెక్కి • నృత్యమాడు
వాని కిలలోన హితుల సు•భాషితములు
వెగటుగాఁ దోఁచు ననియెడు • పెద్దవారి
వాక్యములు నేఁడు విశ్వసిం•పంగ వలసె.

రావ—ఛీ! మూర్ఖదానవా! మృత్యువఁట! నృత్యమఁట! చాలును నీ నీతులు. పో, శీఘ్రముగ పో!

మారీ—రాజా! పోవుటకేమి! నీకుఁ గలుగనున్న కష్టము లొక్కమారు తెలంచుకొనుము.

రావ—అదిగో! మఱియు నదే యుపదేశము! కుటిలచిత్తా! పొమ్మిఁక మారాడక.

మారీ—దైత్యవంశోత్తమా! మానివృత్తి మెలంగెడి నే నీ కార్యము సేయఁబూనుట మాన్యమగునే!

రావ—కాకేమి?

మారీ—రాజా! అట్లొనర్చిన నీకుఁ గల్గునదేమి? రాజ్యము హెచ్చునా? భోజ్యము జిక్కునా?

రావ—ఓరీ! రాజ్యభోజ్యములు మాకు లేవనియా? ఒక తుచ్ఛమానవుఁడు నా సోదరీనాసికాచ్ఛేదకారకుఁడై యుండఁగా, వాని నట్టి మానభంగము సేయుట నాకు మిక్కిలి యవశ్యము.

మారీ—రాజా! పరివారితోఁ బోరొనర్పవలెఁగాని, ఒక యబలను దొంగిలుట న్యాయమా, నీబోఁటి మేటి సురారి?

రావ—ఛీ! ఛీ! బుద్ధివిహీనా! న్యాయము, అన్యాయము! సర్వము మాబోఁటి భూధవులకు సర్వసాధారణము.

మారీ—ఔఁడా! శత్రుసంహారుండవనియు, లోకాతీత కీర్తి ధనుండవనియుఁ గడించిన నీ కీర్తి ఈ కార్యముచే మాయునేమో? ఆలోచింపుము.

రావ—ఛీ! ఇంతమాత్రముచేఁ జేయెత్తి చూపెడు చెనటులుందురా?

మారీ—రాజా! నీ దోర్దర్పంబునకు వెఱచి, లోకులు నిన్ను నిందింపలేరు. అయిన నీ హృదయంబు నిన్నుఁ బీడింపకుండునా?

రావ—ఛీ! మూర్ఖదానవా! ఇంక నిన్ను పేక్షసేయను! ఇదే నీ శిరము వ్రయ్యలొనర్తును (అని కత్తిదూయును).

మారీ—దశకంఠరా! నా నీతులు నీకును, నీ రక్షోవంశమునకు గాని, నా కొఱకు గావు. అయిన నీ మాట మాత్రము మఱచి పోకుము!

ఉ. కామవశాత్ముఁడై, త్రిదివ • కాంతలఁబొందఁగ నేనిఁ దెచ్చి, పెక్
కాములఁ బెట్టి, ఘోరతర • పాపములన్ వడిఁగట్టికొంటి, నా
కామినిలోకశాపమునఁ • గష్టపరంపర లొక్కపెట్టునన్
నీ మహితప్రతాపమును • నిక్కము నీటనుగల్పు రావణా!

తేఁడా! ఇదే పోవుచున్నాను! (నిష్క్రమించును.)

రావ—తిక్క కుదిరినది; నేనును ప్రయాణమయ్యెదను.

మ. విమతారాతి విభేదనక్రియ కళా • విస్తారు మారీచుఁ
బనుపంగన్గతి, నా వచోరచన సం • పత్ప్రౌఢి దీపింపఁగన్
ఘనసంతోష భరంబు పెంపు మెఱయం • గా నాకున్, లోకమో
హన లావణ్యను, మౌనివేషమున, డా • యం బోయెదన్ వేడ్కమై.

[ప్రవేశము : శూర్పణఖ]

శూర్ప—(స్వగత) అకటా! యింకేమి చేయుదును? హా! ఎంత దుర్దశ! ఎట్టి బాధఁ బొందితిని! ఏటి కా యరణ్యమున కేగితిని? పోయినదానను పుత్రునిఁ జూచి వచ్చియుండ నైతిని కదా! అరణ్యమున నుండినమాత్ర మేమి? వారి కుటీరము వైపెందులకుఁ బోయితిని? పోయినమాత్ర మేమి తప్పుగలదు? ఆ శ్రీరామునిపై మోహమేల కల్గెను? పుట్టెఁ బో! అతఁడు నన్ను వరించియుండరాదా? హా! దుష్టాత్మా! ఎంతకార్య మొనర్చితివిరా! నిన్నుఁ దలఁచిన కొలఁది నా దుఃఖము పొరలి వచ్చుచున్నదే. ఎంత కఠినాత్ముఁడవురా. పరమాప్తులఁ బరిత్యజించి యెంత మోసపోయితిని! ముక్కు చెవులు పోవుటయే గాక, నా కుటుంబమంతయు నాశమయ్యెకదా. ఖరదూషణాదులను జంపించినది నేనెగా!

కటకటా! (ధైర్యము దెచ్చుకొని) ఛీ! హృదయమా! యెంత చేసితివి! ఔరా! నే నెంత వెఱ్ఱిదాన నైతిని! పాప మా రామలక్ష్మణు లేమి చేసిరి? నేనేకదా యీ కష్టము లకుఁ గారకురాలను.

సీ. అన్న రాజనుమాట • కెన్నిక వనభూమి
 నొంటిమై విహరించు • టొక్క తప్పు;
నిజపత్ని సహితుఁడై • నృపకుమారుఁడు రాముఁ
 డున్న తావును జేరు • టొక్క తప్పు;
సీతను విడనాడి • లాఁతిదానను నన్ను
 నువిదగాఁ గొనవేఁడు • టొక్క తప్పు,
వలదన్న వినక యా • లలనామణిం గ్రింగ
 నుద్యమించిన యట్టి • యొక్క తప్పు,
గీ. తప్పులకుఁ బుట్టినిల్లైతి • తమ్ము లన్న
లాదిగాఁ గలవారల • యంత్యమరయు,
మృత్యు దేవతనై జని • యించి తకట!
అకట! యేల యీ ప్రాణంబు • లవని నింక.

అనురాగాతిశయ పరవశురాలనై, మదనానలసంతప్తనై, కన్నుఁ గానక, ఆ సర్వాతిశాయి శౌర్యాది గుణగణ విరాజితులైన సోదరుల కడకేగి యీ గతిఁ దెచ్చుకొంటిని. కటకటా! అంతటితోనైన మిన్నకుంటినా! స్మరశరాహతికిఁ దాళఁజాలక ఆ వినయ సౌశీల్యాది సద్గుణఖనియగు సీతాసతీమణినిఁ జంపఁ బోయితిని. ఔరా! మోహ మెంత చెడ్డది. ఎట్టి దుష్టకార్యములనైనఁ జేయిం

చుఁగదా! ప్రాణహితులను ప్రబల శాత్రువులుగ మార్చును; సత్యసంధులను అసత్యవాదులుగఁ జేయును; నీతిపరులను అవినీతులుగఁ ద్రిప్పును; గుణగరిష్ఠులను మూర్ఖచిత్తులఁ జేయును; సుఖసంపదలందుఁ దులదూఁగినవారిని దుర్వ్యసనాబ్ధిలోఁ ద్రోయును; శాంతిధాములను క్రోధచిత్తులుగఁ జేసి మెట్టి దుష్క్రియలనైనను జేయించును. అబలులను బలాఢ్యులుగ మార్చును; కాముకులకు కండ్లు గ్రమ్మును; ధైర్యము హెచ్చును. లజ్జ తొలఁగును. మదనాగ్ని దేహమునందు ప్రాఁకును. ఇది మంచి యిది చెడ్డయని తెలిసికొను తెల్వియుండదు. వావి వరుసలు లోఁపవు ముందు వెనుకలు తెలియవు. ఇవి యవి యననేల! మోహమే సర్వదుష్టగుణములకును స్థానము. మోహమునఁ బుట్టని దురూహలున్నవా? అకటా! ఈ పాడుమోహమే కదా నా వంశవినాశకారణం బయ్యెను. ఔర! ఎంత పీడఁజెడినైతిని! ఎంత అవమానితనైతిని. ఇట్లయ్యు జీవింపవలెనా? ఛీ! ఇంక నా బ్రతుకేల? హృదయమా! శోకభరంబున వ్రక్కలు గారాదా? జీవములారా! కాయముఁ బాయకుంటిరే? హా! మదనా! నీవైనను నన్నుఁ గాల్చి వేయుమా!

(అని పడిపోవును)

# సీతాపహరణము

## పంచమాంకము

---

[సీతారాము లిరువురు: జింక చిందులు త్రొక్కుచుండును.]

సీత—నాథా! ఇదేమివిచిత్రము. ఈ లేడి యెందునుండి వచ్చినదో కదా!

ఉ. ఎన్నఁడుఁజూడ మీ హరిణ • మెచ్చటనుండి యిటేగుఁదెంచెనో.
కన్నులపండువయ్యెఁ గనఁ • గా నిది బంగరు జింకపిల్లయౌ
నన్నటు వన్నెలీను మ • హామృతశీలను చెంగుచెంగునఁ
తిన్నఁగ నిక్కడై వచ్చి తన • దివ్యశరీరపుఁగాంతిఁ జూపెడిన్.

ఆహా! దీని నడకంపు వైఖరి యెంత సొంపుగ నున్నయది! కన్నులు వర్ణనాతీతములై స్వర్ణమునకు పరిపూర్ణముగ వన్నెఁదెచ్చుచున్నవి. నాథా! దీని కొమ్ముల యందముఁ జూడుఁడు. గొరిజ లెంత చెలువముగ నున్నవో గాంచితిరా! దీని రోమకాంతి యెంత నేత్రపర్వముగ నున్నదో యొక్కింత వీక్షింపుఁడు. ఇట్టి విచిత్రమృగము నెందైనఁ గాంచియుంటిరా?

రాము—సీతా! నిక్కముగ నీ హరిణము మిక్కిలి విచిత్రముగనే యున్నయది.

సీత—(లేడిని సమీపించి) ఎన్నియో లేళ్లు ఈ వైపు మళ్లు చుండఁ గాంచియుంటిని. కాని యిట్టి లేడి నెట్టియెడనైన, నెవ్వరైనఁ జూచి యున్నారమా? ఎన్నియో మృగములు నేనందిచ్చిన కందమూలముల నందుకొని తినియుండెను గాని, యీజింక ఇతరజింకలవలెఁ గాక చెంతనైన డాయక చెంగుచెంగున నెగురుచున్నయది. అయినను చూచెదను. (ఫల మందింపఁబోవును; జింక దూర మేగును.) చూచితిరా యిది బెదరు విధము?

రాము—(తలయూఁచును.)

సీత—నాథా! ఇట్టి కురంగము మన నిజపురాంతికోద్యానమున నుండిన, నితర లేళ్ళ మధ్యమున నియ్యది నక్షత్రమండలి నలంకరించు చంద్రునియట్లు కాంతి నీను చుండును. ఇట్టిమృగమును పట్టుట ఉచితమని తోఁచెడిని.

రాము—కాంతా! దీనిని ప్రత్యేకముగ పట్టవలయునా? ఈ చేరువఁ దిరుగాడు దీనిని నీవే మచ్చికచేసికొనఁ జాలవా?

సీత—ఇది మచ్చికపడునట్లుగఁ గనఁబడదు. చూచితిరిగా; ఫల మందియ్య నియ్యది బెదరిపోయిన విధమును.

రాము—ప్రథమము గదా? కొంచెము వెలివకుండునా?

సీత—ప్రాణేశ్వరా! మన మేమి కొట్టఁబోయితిమా? తిట్టఁ బోయితిమా? పెట్టఁ బోయినప్పుడే పరువులెత్తు ఇట్టి పిరికి జింక మనకు మచ్చికపడునని తలంపను.

రాము—ప్రేయసీ ! ఇప్పుడు గాకున్న కొలఁది దినములలోఁ గాఁగలదు. ఒక్క జింక విషయమే కాదు. లోకమంతయు నిట్లే. మనుష్యులును ప్రథమదర్శనమున లజ్జాభయాదులవలన ఉన్నతపురుషులను జేరవెఱతురు. కొన్నిదినముల పరిచయము గల్గినయెడల వెఱచినవారే తల కెక్కుదురు. ప్రపంచమున సర్వవిధముల గణనకెక్కిన మనుష్యుఁడే ప్రథమదర్శనమున భయభరితుండగుచుండఁగా నీ కురంగము నిన్నుఁజూచి నిలువలేదన్న వింతయా ?

సీత—ప్రాణనాయకా ! పోనిండు. కొన్నిదినము లీ జింక యిందుండునా ?

రాము—ఆహా !

సీత—ఏమో, ఎవ్వరు చెప్పఁగలరు ? ఈ దినమే యదృశ్యమైన ఇట్టిది మఱొకటి లభించునా ?

రాము—ఇంతీ ! ఈ కాంతారమున నొక్కటియన నేల, వలయునన్ని పట్టి తేవచ్చును.

సీత—నాథా ! ఎన్నియేని పట్టవచ్చునుగాని యిట్టి కురంగము మఱొక్కటి పట్టుపడుట కష్టతమము. దుర్లభమనియేఁ జెప్పవచ్చును. ఇట్టి స్వర్ణమృగములు వేఱుకలవా ? యని యనుమానము గల్గెడిని.

రాము—సీతా ! అట్టి యనుమాన మణుమాత్రమును వలదు. అయినను కందమూలంబులఁ దిని, స్వేచ్ఛావిహారము సల్పు నీకాననమృగములను బంధించుట, వాని ముంగాళ్లు నఱికినట్లేసుమా !

సీత—నాథా ! దీనిని బంధింపనేల? విచ్చలవిడిగ విడువమా?

రాము—అప్పటికిని వీనిని కష్టపెట్టినవార మగుదుము. ఎంత పెంచినను అవి వాని బృందము నందునవలె నుండవు. కానన మృగంబులను పురములం దుంచినఁ గృశించును. ఇది యనుభవనీయము కదా?

సీత—మోహనాంగా ! పోనిమ్ము; దీనిని బంధింపవలదు. ఒక్కసారి నన్నుఁ దాకనిచ్చిన మిక్కిలి కృతార్థ నయ్యెదను.

రాము—కాంతామణీ ! దీనిని పట్టు టెట్లు?

సీత—నాథా ! అది మీకుఁ దెలియనిది కాదు.

రాము—వనితా ! దీనితో నే నెంతదవ్వు పరువిడఁగలను?

సీత—పరువిడి అలసిపోవుటకన్న బాణము సంధించిన కష్టము లేకయేఁ జిక్కఁగలదు.

రాము—సీతా ! ఎంతమాటాడితివి? అయ్యది వేటునకుఁ జచ్చిన?

సీత—చచ్చునని కొట్టముగదా !

రాము—చచ్చిన దనుకొందము. నోరులేని జంతువులను జంపఁదగునా?

సీత—నాథా ! ఎందఱు దైత్యులు మీచే నిహతులు గాలేదు. చేసిన పాపములలో నిది యొకటి.

రాము—సీతా !

గీ. క్రూరరాక్షసులను నేలఁ • గూల్చు టొకటి,
పరమభక్తుల నెల్లఁ గా • పాడు టొకటి,
క్షుద్రజంతువులను జంపఁ • జూచు టొకటి,
రాజకార్యములను మాట • రమణి వినవె ?

పాపభీతిలేని లోకకంటకులగు రక్కసులను నుక్కడంచుటయు, క్షుద్రజంతు సముదాయమును గృధ్రముల వలెఁ జంచి చెండాడుటయు పాపకార్యములని తలంపకుము. ఈ కార్యములన్నియు సుజన రక్షాదక్షుఁడగు ఱేని పనులుగాని, పాప మీ కురంగ మట్టిదా ?

సీత—అయినఁ జంపకయే పట్టి యిండు. ఈ జింకను మన అయోధ్యకుఁ దీసికొని పోయినచో నా మఱఁదులకును, అత్తలకును ఎంతో సంతోషమైనను పుట్టక తీఱదు. నాథా! ఇంతమాత్రముచేసి నాకు సంతసముఁ గూర్పలేరా ?

రాము—

ఉ. కోమలి! నీకు సంతసముఁ • గూర్చుటకంటెను నాకుఁ దైన నా
కేమియు వేఱుకార్యము, మ • హీతలమందునఁ గానరాదు సూ!
నీ మది నన్యథా దలఁచి • నిష్ఠురవాక్యము లాడఁబోకు, నే
నీ మృగశాబకంబు నిదె • యెవ్విధమైనను దెచ్చియిచ్చెదన్.

సీతా, సతుల కోర్కెలు చెల్లింపని పతులు గలరా ?

సీ. కన్నవారల వీడి • కాంతారసీమల
నాతోఁ జరియించు • నాతియగుచు,
సుఖసంపదల రోసి • చుట్టాల నెడఁబాసి
విభునితో మెలఁగెడు • వెలఁదియగుచు

సత్కార్యములఁ జేయఁ • సమయానఁ గడుఁ శ్రద్ధ
భర్తకుఁ దోడ్పడు • పడఁతి యగును
సద్గుణ ఖనియయి • జానుమీరెడు సతి,
కన్యాంగ లక్ష్మికి • నమల మతికి,
గీ. మానసోద్యాన వనసీమ • లోనఁ గల్గు
కోర్కెలతీఁగియుం, సహజనా • కూన్నతోడ
వానిఁ జెల్లింపఁ జేరని • వాని కెంము
ధవుని నామంబుఁ గాల్పనే • ధరణియందు.

[లక్ష్మణుఁడు ఫలాదులతోఁ బ్రవేశించును.]

తరుణీమణీ! ఇదే లక్ష్మణుఁడును సమయమునకే వచ్చుచున్నాఁడు. సహోదరుల మిత్త్రత్వమును నీ కోరిక నీడేర్చెదము. లక్ష్మణుఁడు నాకీ కార్యమునఁ దోడ్పడఁ గలఁడు.

లక్ష్మ—(సీతారాములకు నమస్కరించును.)

రాము—లక్ష్మణా! నీ వదినె మిక్కిలి యాఁకలిఁ గొని యున్నది. ఏయే ఫలములఁ దెచ్చితివయ్యా?

లక్ష్మ—అన్నయ్యా! తడవు క్షమింపుఁడు. పాపము మా వదినెగారెంతసేపటినుండి వేచి యున్నారో కదా?

సీత—సౌమిత్త్రీ! ఆఁకలి కేమి? (లేడినిజూపి) ఈ స్వర్ణమృగమును జూడ, నా యాఁకలి తీఱినట్లున్నది. ఎంత సేపటి నుండియో, మీ యన్నగారిని, కురంగమును పట్టుఁడని వేఁడుచుండఁగా ఇప్పటికి వారికి నా యందు కరుణ జనించినది. సమయమునకే నీవును వచ్చుట తటస్థించెను.

లక్ష్మ—తల్లీ! దీనిని పట్టుటెంత? మీరు ఫలాహారముఁ జేయుండు. మే మనశ్యము మృగమును పట్టెదను.

సీత—అయ్యా! కాలము మించిన మృగము లభింపదు.

రాము—లక్ష్మణా! సతి ఇప్పటికే నాపై సలిగియున్నది. మన మిద్దఱము శీఘ్రముగఁ బోయివచ్చెదము రమ్ము.

లక్ష్మ—అన్నయ్యా! అట్లే వచ్చెదను. కాని, ఈ జింకపై వదినెగారి కింత మక్కువ యెట్లు జనించె?

రాము—విచిత్ర మృగము గదా!

లక్ష్మ—అన్నా! నిక్కముగ నీ మృగము అపరూప మృగమే కాని,

కం. మన మిన్ని జింకలను గాం
చిన వారముగాని యిట్టి • చిత్రమృగంబున్
గని విని యెఱుఁగము, దీనిని
గనఁ గన ననుమాన మెందు • కలిగెడు నన్నా!

రాము—తమ్ముఁడా! నీ యనుమాన మేమి?

లక్ష్మ—మీకుఁ దెలియనిది కాదు.

గీ. ఎదు నెప్పుడుఁ జూడని • యీ మృగంబు
ఇప్పు డీ కుటీరమువైపు • ఎట్లు వచ్చె?
వచ్చెపో యిట్లు లూరక • భయముఁ జెంది
చెంగు చెంగున దాఁటి పో • వంగ నేల?

అన్నా! ఈ లేడినిఁ జూడఁజూడ నా కనుమానము హెచ్చుచునే యున్నది.

రాము—అట్లైన, మాయారాక్షసు లేమైనఁ గీడెంచియుందు రందువా.

లక్ష్మ—నా కట్లే తోఁచుచున్నది.

రాము—అయినమాత్ర మేమి భయము ? రాక్షసుఁడేమైన మఱింత మేలగును.

ఉ. నీవుఁ దలంచినట్లు లిది
నిక్కముగా నొకదైత్య కృత్యమాఁ
గావుత ! దానవేమి, యన
ఘా ! యటులైన మఱింత మేలు ! శా
త్రీవల ఖంబునం గల యు
త్త్రప్రవరుల్ సుఖవార్ధిఁ దేల, ని
చ్చా విధనే విచిత్ర మృగ
శాలికముల్ బొలియింపఁ బోలదే !

లక్ష్మ—అన్నా ! దానవవధ అత్యావశ్యకమని నేను వేఱుగఁ జెప్పవలెనా ? అయిన మన మిరువురమును బోయిన వదినెగా రొంటరిగ నుండుట శ్రేయమా ?

రాము—నేనును అదియ తలంచుచున్నాఁడను. అట్లైన నీ విందుండుము. నేఁ బోయివచ్చెదను.

లక్ష్మ—సోదరా ! వలదు, వలదు ; నేనే పోయెదను. నీవే యిందుండుము.

రాము—అయ్యో ! ఫలములకై వెడలి అడవియంతయుఁ దిరిగి కడుఁ బడలియున్నాఁడవు. వలదు; నీ విందుండుము. (సీతను జూచి) సీతా ! లక్ష్మణుఁ డిందే యుండఁగలఁడు.

స్వయముగ నేనే మృగమును వెన్నాడెదను. (లక్ష్మణునితో) తమ్ముఁడా నీ వింటే భద్రముగనుండి, సీతను గాపాడుచుండుము. నేను వెళ్లెదను.

లక్ష్మ—(తలయూఁచును.)

(రాముఁడు నిష్క్రమించును; సీత కుటీరములోని కేగును.)

లక్ష్మ—(జింక పోయినవైపు చూచుచు) ఆహా! ఇప్పుడు కదా నా యనుమానము తీఱినది. నేను తలంచినట్లైనది. ఈ హరిణము నిజమైనదే యైయుండిన ఇంత వింతగఁ జిందులుఁద్రొక్కదు. ఎంత బెదరినను జింక లిట్లుగురుట ఎన్నఁడును జూచి యెఱుంగను. ఒకచోఁ గనుపడి, యచ్చట అదృశ్యమై తత్క్షణమే ఆ ప్రక్కన గోచరమగుచున్న యీ జింక నట్టిది కానేరదు. తప్పక ఈ కార్యము రాక్షసులదే. మాయారాక్షసులగు మారీచాదులు మున్ను విశ్వామిత్రయాగమును భంగపఱచు నిమిత్తమై హరిణరూపంబులను దాల్చి కడు నద్భుతముగ నా పరిసరప్రాంతములందు విచ్చలవిడి విహరించి యాగరక్షణార్థమై యరిగిన మా యన్నగారి అస్త్రధాటికి తాళఁజాలక అదృశ్యులైనట్లు జ్ఞప్తియున్నది. అసహాయుఁడై మా యన్న యడవియం దుండుటఁ జూచి, మారీచుఁడేమైన నీ సమయమునఁ బగఁ దీర్పుకొనఁ దలంచెనా? కాదేని—

సీ. ఏ వాఁడు సీకాన • లోన గాంచనియట్టి
బంగారువన్నె కు • రంగమేమి?
స్థల మొందు లేనట్టు • బలు వింత నీకుటీ
రముపై ప్రతిరుగఁ గా • రణ మదేమి?
దానిఁ జూచిన యంత • తల్లి సీతమ్మకు.
నెనలేని ప్రీతి జ • నించు టేమి?
జనియించినంత నా • థునిఁ జేరి ప్రియముమై
లేడినిఁ బట్టఁ గా • వేఁడుటేమి?
గీ. వేఁడినంతన నాయన్న • వినుటయేమి?
పనుచు జింకను వెన్నాడ • వెడలుటేమి?
వెడలుటను జూచి హరిణంబు • వెదరుటేమి?
అంతయును జూడ నిది కడు • వింత తోఁచె.

నిక్కముగ నిదంతయు మిక్కిలి విచిత్రముగ నున్నది. ముమ్మాటికిని ఇది రాక్షసమాయయే. (ఆలోచించి) ఔరా! ఏమిది; పోయి నాయన్న కడ్డుపడెదనా. (పోఁబోయి) నేనెంత వెఱ్ఱివాఁడను; నాయన్న కింత తెలియకున్నదా? స్వయముగఁ బెక్కండ్ర రక్కసులను నుక్కడంచియున్నాఁడే. అట్టి శ్రీరామచంద్రునకు ఇదంతయు రాక్షసమాయ యని తెలియకున్నదా? ఈ యల్పమును నేనతనికిఁ దెల్పవలెనా? (ఆలోచించి) చెప్పిన మాత్ర మేమి తప్పుగలదు? (పోఁబోయి) ఆహా! ఎంత సాహసించితిని! మఱి మఱి చెప్పి వెడలిన సోదరుని యనుమతి నింతలో మఱచినాఁడనుగా! ఔరా! ఈ తల్లి నీ స్థలమున నొంటరిగ విడిచియే పోయియుండిన ఎట్టి పాపము వడిఁ

గట్టుకొనియుందును ? ఈ ఘోరారణ్యమునఁ గల క్రూర రాక్షసు లెంతకైనను సాహసించెదరు కదా ! అయిన నిప్పుడేమి మించినది ?

నే నెన్నిన ట్లది మాయాకురంగమే యగునేని, సోదరుఁడు దానిని తప్పక కూల్చును. ఈ విషయమున నే నీ భంగి చింతింప నక్కఱలేదు; జాగరూకుఁడనై కుటీరము చుట్టుఁ గాచి యుండెదను. (అని కుటీరము చెంత నడయాడుచుండఁగా)

(తెరలో)

ఉ. బంగరు జింకఁ గాఁ దలఁచి
పట్టుఁడటంచును వేఁడినట్టి నా
యంగన కోర్కెఁ దీర్ప, హృద
యంబున నెంచి మఱియు సోదరున్
అంగనఁ గావఁగా నునిచి
హర్షముతో నిటు వేగుదెంచితి
న్బంగరు జింక కాదిది, క
నంగను రాక్షస మాయయేఁ జుమీ !

లక్ష్మ—(వినుచు) మాయాకురంగమగుట ఇప్పటికి విస్పష్టమైనది, ఇఁక భయములేదు.

(తెరలో: హా ! లక్ష్మణా ! హా ! సీతా !)

లక్ష్మ—(వినుచు) ఆ! ఇదియు రాక్షసుని మాయోపాయమే! మమ్ము నెడఁబాపించుటకై మాయారాక్షసుఁ డిట్లఱచినాఁడు. (భీతితో సీత కుటీరము వెలుపలికి వచ్చి, లక్ష్మణునితో)

సీత—అన్నా! లక్ష్మణా! విన్నావుగదా మీ యన్నగారి కేకలు? ఆయన కేదో యాపద కలిగిన ట్లున్నది. చూచి రమ్మా?

లక్ష్మ—అమ్మా! ఎట్టి యిక్కట్టును గల్గియుండదు. మీరు వెఱవవలదు.

సీత—అయ్యా! స్వయముగ మీ యన్నయే మన యిద్దఱిని బిల్చిరి. పరాకున నీవు వినలేదు కాఁబోలు, పోయి రమ్ము.

లక్ష్మ—తల్లీ! సర్వమును గడు జాగరూకుఁడనై విన్నాఁడను. నిముసమునకు పూర్వము అన్నగారు జింకను జంపఁ బ్రయత్నించుచుండిరి. ఈ కేకలు మా యన్నగారివి గావు. నా మాట నిక్కమని యెఱుంగుఁడు.

సీత—అయ్యా! సౌమిత్రీ! ఏల కావనెదవు? మీ యన్న కంఠము నే నెఱుంగనా? త్వరగఁ జూచిరమ్మా.

లక్ష్మ—జననీ! ఇన్ని విధములఁ జెప్పుచుండఁగా ఏటి కిట్లు భయపడెదవమ్మా? సోదరుని, మిమ్ము, నన్ను వంచించుటకై ఎవఁడో రాక్షసుఁడు సల్పిన మాయయే కాని అన్నగారు వైచిన కేకలు గావు. నా మాటలు నిక్కమని యెఱుంగుఁడు.

సీత—ఇంకను గావనుచున్నావుకదా! అయ్యా! ఏల నన్నిట్లు నొప్పించెదవు? తర్వగఁ జూచి రమ్మా.

లక్ష్మ—మాతా? ఇంత చింతిల్లవలెనా? నే నన్నృత మాడితినా? సువర్ణమృగమని భ్రమించినది మాయాకురంగము. రామబాణానలమున నేలఁ గూలుచు మనలను

మోసపుచ్చుటకై రామకంఠమున నా హారిణ మిట్లు కేకలు వైచినది. ఇది ముమ్మాటికి సత్యమని నమ్ముము.

సీత— అయ్యా! నీకు మ్రొక్కెదను; మారుఁబల్కక చూచి రమ్మా.

లక్ష్మ— (తొలఁగి) అమ్మా! ఎంత వెఱ్ఱివి! నీవా నాకు మ్రొక్కుదానవు! లోకైకమాతవే! కరుణాసమేతవే! నీకు లోకము మ్రొక్కులిడునే! నీకా మారుఁ బల్కువాఁడను! ఎవ్వరైన సాహసించియుండిరా? తల్లీ! ఊఱడిల్లుము. శ్రీరామచంద్రుఁడు సురక్షితముగ నున్నవాఁడు. ఒక్క రక్కసుఁడు అనన్యసామాన్య ప్రతిభాశాలియగు నీ భర్త నెదుర్కొన సాహసించునా? వేలకొలఁది నిశాచరులు నిహతులౌటఁ జూడవా?

సీ. అలవాఁడు గాధేయుఁ • డాచరించినయట్టి
యాగంబుఁ గాపాడి • నట్టి ఘనుఁడె
తనుఁ జంప డాసిన • తాటకి నవలీలఁ
ద్రుంపఁ గల్గినయట్టి • దోర్బలుండె
ముక్కంటి విల్లుద్రుంచి • ముదమార నిన్నుఁ జే
కొని వెలసిన యట్టి • ఘనయశుండె
పరశురాముని గర్వ • భంగంబుఁ గావించి
ధీరుఁడై మించిన • భూరి భుజుఁడె
గీ. ఖరుఁడు, దూషణుఁడుఁ, ద్రి • శిరుఁడు మున్నగు రక్క
సులను, వారి సైన్య • ములనుఁ జంపఁ
గలిగినట్టి నీదు • కాంతున కెందైన
హాని సేయఁగల్గు • నసురుఁ డున్నె?

ఇట్టి పరాక్రమశాలియగు నా సోదరునకు, ఒక్క-ముక్కడి రక్కసునిచే హాని చేకూరఁ గలదా ?

సీత.—అయ్యో ! లక్ష్మణా ! నీ వేమన్నను నా హృదయము కుదుటఁ బడకున్నది. చూడుమా యీ యపశకునములు. అయ్యో ! దక్షిణనేత్ర మదరుచున్నది; దక్షిణ భుజము చలించుచున్నది. అయ్యో ! ఇంతకన్న నిదర్శనములు వేఱు కావలెనా ? శీఘ్రముగఁ బోయి నా నాథుని జూచి రమ్ము నాయనా.

లక్ష్మ—అమ్మా !

కం. నేత్రం బదిరిన మాత్రన
గాత్రము చలియించినంతఁ • గలుగునె యిడుముల్
ధాత్రిని వెఱపువలన నీ
చిత్రములే తోఁచుచుండు • స్త్రీలకు నెందున్.

తల్లీ ! వెఱపున నెన్నియైనఁ దోఁచును. భయపడకుము.

సీ. శ్రీరామ చంద్రుని • ధీరత మది నెంచి
తల్లిరో నీవూర • డిల్లకుమ్మ
రఘురామచంద్రు దో • ర్బలకార్యముల నెంచి
యమ్మరో దుఃఖింప • కమ్మ నమ్మ
ముక్కంటి విల్ ద్రుంచు • భుజబలంబుఁ దలంచి
మాతరో శోకింప • మానుమమ్మ
దైత్యాళి మర్దించు • ధైర్యంబు నెదనెంచి
జననిరో ! ధైర్యంబు • గనఁగదమ్మ
గీ. దండకారణ్య తాపసో • త్తములఁ గావ
క్రూర దనుజాలిఁ జక్కాడఁ • గూలనేసి

పొలుపు మీఱిన నీదు వి • భునకుఁ గూడ
ఎగ్గు గల్గునె భువిలోన • నెంచిచూడ ?

సీత—అయ్యా ! లక్ష్మణా ! నీవింత కఠినాత్ముఁడవని యెఱుం గను గదా ! ఎంత వేఁడినను వినకుంటివిగదా ! ఇట్టి కృతఘ్నత పాడియగునా ?

మ. ధరపై సజ్జనులైన వారొరుల సం
తాపంబునుం జూడఁజా
లరనా, ఆప్తుల కష్టముల్ గనుచు నే
లా గోర్తు? ; ఊహింపఁగన్
పరమాప్తుండగు తోడబుట్టువును గా
వంబోక నీ విట్లు సో
దర వాత్సల్యము నింత లేక మనుటల్
ధర్మంబె యో లక్ష్మణా !

లక్ష్మ—అమ్మా ! చెప్పవలసినదంతయుఁ జెప్పినాఁడను. ఒప్పులు తప్పులుగఁ దోఁచినవి; నా మాటలు కఠినతమములై యొప్పినవి. నీవును మదిని చాల నొచ్చితివి. ఇంక నీ వెట్లు తలంచినను సరియె, సోదరుఁడు వచ్చువఱకు విన్నిందు ఒంటరిపాటున విడిచి పోఁజాలను.

సీత—పోవా ? అన్నా ! లక్ష్మణా ! నీతలంపేమి ? పోవా ? నిక్కమా? ఇట్లాడఁదగునా? నీయన్న వచ్చునా? వచ్చుటకైన సాయపడవలదా? అయ్యా! ఇప్పుడైనను బోయి రమ్మా.

లక్ష్మ—(మిన్నకుండును)

సీత—ఓయీ ! ఇట్టి కట్టిఁడివా నీవు ! కర్కశ హృదయా ! నీ గుండె పాషాణమైనదా ? అబల వేఁడుచుండఁగా మూఁగ వానివలె మిన్నకుంటివా ?

లక్ష్మ—(మిన్నకుండును)

సీత—అకటా ! క్రూరాత్మా ! ఏటి కిటికి నన్నలజడిఁ బెట్టె దవు. నీ మది నేమి తలంచితివి? భరతుఁడేమైనఁ జెప్పి పంపెనా? ఆ సోదరద్రోహి యాజ్ఞకు బద్ధుండవై రాజ్య కాంక్షచే నా నాథునిఁ ద్రుంప నెంచి యిట్లు వచ్చితివా ? నీ తిరస్కారభావమును జూడ అట్లే కనిపించుచున్నది. అనపరాధుఁ డగు శ్రీ రామచంద్రునియెడ నీ కిట్టి కృత ఘ్నత పాడియగునా ? లక్ష్మణా! ఇంకనైన జాగుచేయక మీ యన్నకుఁ దోడ్పడి, అతనిఁ గాపాడి రమ్మా !

లక్ష్మ—కటకటా! తల్లీ ఏటికిట్టి యపనింద మా భరతునిపై మోపెదవు? అమ్మా! తన్ను పట్టాభిషిక్తుం జేయనెంచి, కుటిలతంత్రము లెన్నియో పన్ని ఎన్నియో విధముల వేఁడుకొనిన కన్నతల్లిమాటలకు సైతం మీఁకొనక, వసి ష్ఠాది మునిపుంగవుల సదుక్తులనైన వినక, జనని యొన ర్చిన తప్పు నెఱింగి శ్రీ రామచంద్రుని పట్టభద్రునిగఁ జేయ నెంచి రాజ్యమునకు రమ్మని పిల్వవచ్చిన సచ్చరితుండును, సర్వసద్గుణ శోభితుండును, దుష్క్రియాపరతంత్ర దూరుం డును, నిత్య సత్యైకదీక్షానిరతుండు నగు మదీయ సోదరుం డగు భరతుండు ఇట్టి చెట్టఁ దలంచునే? మాతా ఇట్టి పెట్టి దవుఁ బల్కులు చెల్లునే ?

సీత—ఓయీ! నీవు మాత్రము తక్కువ వాఁడవా?

గీ. దాసిబోధకు లోనైరి • తల్లిగారు
తరుణిమాటలు విన్నారు • తండ్రిగారు
తల్లిదండ్రులె యీరీతిఁ • దనరనార!
సోదరునకీవు ద్రోహిగా • కుందువోకొ!

లక్ష్మ—జననీ! ఏటికిట్లూరక దూరఁదొడంగెదవు? నీ వెన్నియైన నాడుము. అన్న వచ్చువఱకు నిన్నిందు ఏకాకిగ విడిచి పోవఁజాలను. మున్నాటి కిది సత్యము.

సీత—

కం. వినవా? వినవా? అనుజుని
గన జనవా? లీల దనుజ • గణమును దునుమన్
జనవా? ఇనకుల చంద్రుని
ఘన కరుణను గావఁ బోవఁ • గను దలకొనవా?

లక్ష్మ—(మిన్నకుండును)
సీత—ఓయీ! ద్రోహీ!

ఉ. భ్రాతకుఁ గీడు వచ్చునటు
వచ్చి యరణ్యము సొచ్చి హెచ్చగన్
బ్రీతిని జూపువానివలె
వింతగ నీవు నటించుచుండి, యీ
రీతిని నిడు సోదరుని
మృత్యువు నోటను బాలువైచి సా
కేతపురంబుఁ జేరుచు సు
ఖింపఁదలంచితి వోకొ దుర్మతీ!

లక్ష్మ—(మిన్నకుండును)

సీత—(స్వగత) అయ్యో! దైవమా! ఈతఁ డేమి చేయ నెంచి యుండెనో కదా? అనదనై యున్న నన్ను ఎన్ని వెతల పాల్సేయనున్నాఁడో కదా? ఇతని కేమైన దుర్బుద్ధి జనించెనా! కాకున్న నెన్నఁడు లేని మూర్ఖము ఈ నాఁడు ఈ సమయమున నెట్లు పుట్టును! అక్కటా! ఈతనితీరు అనుమానాస్పదముగనే తోఁచుచున్నది. ఛీ! ఇట్టి వాఁడని యెఱుంగక ఎంత మోసపోయితిని! (ఆలోచించి) ఛీ! పాడుహృదయమా! యెట్టి పాప మొడిఁ గట్టుకొనుచుంటివి!

చం. పరసతు లెల్లఁ దల్లులని
భక్తిమెయిం జరియించినట్టి స
త్పురుషుఁడు, ఆశ్రితావళి
మోదముగూర్చెడు స్నేహితుండునున్
పరమ కృపాళుఁడున్ మధుర
భాషియు రాజితధర్మమూర్తి యౌ
మరుచిరమానసుండు నిజ
సోదరికన్నను మిన్నగాఁగ, న
న్నరసిన కేటి కామ మది
యౌనని మానసమా. యెఱుంగవే!

(ఆలోచించి) ఆహా! మదీయ హృదయమునకన్న మిన్నయగు నదేమి? లేని నిందారోపణ సేయ మానస మొప్పునా? ఒప్పదు. నా యనుమానమును బలపఱచుచు ఇతర విషయములు గూడఁ దోఁచుచున్నవి.

ఉ. ఏకత నుండు పూరుషుల
కెందున నమ్మఁగ రాదటంచుఁగా
లోకములోన వాడుక; ప
రుల్ గనరా రిట నిట్టివేళ నే
నేకడ డాగుదాన నెటు
లీతని బారిఁ బాయుదుఁ? గటా!
ప్రాకట పూజ్య నా విభుని
పద్మపలాక్షుని ఎట్లు డాయుదుఁ?

కటకటా! నా ప్రాణనాథుని కంఠధ్వని వినినదాదిగ ఈతని తీరు మిక్కిలి యనుమానాస్పదముగనే గలదు. ఛీ! ఇట్టి దుర్జనుఁడని యెఱుంగక ఎంత మోసపోయితిని! (ప్రకాశముగా) అయ్యా! లక్ష్మణా! నీ తలంపేమి? అనాథనై యున్న నన్నేమి చేయనెంచితివి చెప్పుమా?

లక్ష్మ—హరి హరీ! (చెవులు మూసికొనును)

సీత—ఓయీ! నీ కేమైన చెడుబుద్ధి పుట్టెనా? తోఁబుట్టువు మృతికై వేచి నన్నుఁ జేపట్టఁ దలఁచితివా? ఛీ! నీచాత్మా సోదరద్రోహీ! నీవే యిట్లు తలంచితివేని ఈ క్షణకాలమున నీ చీర చెఱఁగు కుత్తుకకుఁ జుట్టుకొని ప్రాణము విడిచెదను.

లక్ష్మ—హరి హరీ! తల్లీ! ఎట్టి శూలములతోఁ బొడిచి చంపితివి, పిన్నతనమాదిగ నిట్టి వాఁడి ముల్కులు నా హృదయశల్యమున నాటినవా రుండరుగదా!

సీ. పంచభూతములలో • పరమపావనమైన
భూదేవి కడుపునఁ • బుట్టినావు;
ఘన తపోధనరాశి • జనక రాజేంద్రుండు
అలుచేతఁ బెంపఁగాఁ • బెరిగినావు;
ముక్కంటివిల్ ద్రుంచి • పౌరుషమీఱినయట్టి
శ్రీరామపత్నివై • చెలఁగినావు;
ముగురత్తలను భక్తి • మోహించి వారల
యొప్పూల కుప్పవై • యొప్పినావు
గీ. ఎల్ల రీతుల శీలవై • యెసఁగినావు.
బిడ్డలను మాడ్కి మమ్మెల్లఁ • బెంచినావు
అమ్మరో! యిట్టి పరిశుద్ధ • యైన నీవు
ఇటుల దురితోక్తు లెటు లాడ • నెంచినావు.

సీ. వర గుణుండగుట, స • ద్గురుఁడంచుఁ దలఁపోసి
శిష్య భావముతోడఁ • జెలఁగినాఁడ
తోఁబుట్టు వగుట సం • తోషినై కష్ట సౌ
ఖ్యములందుఁ దోడ్పడఁ • గలిగినాఁడ
ధరణీంద్రుఁ డగుట, స • తంబును శౌరవా
త్సల్యంబుఁ జూపింపఁ • జాలినాఁడ
కన్నవాని విధంబు • నన్నుఁ బెంచుచునుంట
తండ్రి తుల్యుఁడటంచుఁ • దలఁచినాఁడ
గీ. కన్నతల్లిని మఱపింపఁ • గల్గినట్టి
నిన్ను నా తల్లిగా మది • నెన్నినాఁడ
అమ్మరో! సాక్షి యగుట ని • న్నధికభక్తి
శుకుని పత్నిగఁ దలపోసి • పరలినాఁడ!

మాతా! ఎప్పుడైన మీకు మారుఁ బల్కియుంటినా? ఎందునైన కృతఘ్నుఁడనై చూపట్టితినా; ఏకాలముననైన మీ ముఖారవిందమును కన్నెత్తి చూచియుంటినా? తల్లీ! అన్యథా తలంపకుము. తప్పు క్షమింపుము. ఇదే పోయివచ్చెదను. (నడుచుచు, తనలో) అక్కటా! హృదయమా! ఊఱడిల్లుము. నిన్నెవరేమనిరి? నీ వేమి తప్పు చేసితివి? చింతిల్లకుము హృదయమా!

ఈ నాఁటికైనను స్త్రీజన సహజ చాంచల్య మెఱుంగుము. ఇవి యన్నియు నవలా ప్రపంచమునకు నైజగుణంబులు! చూపునకు మాత్రము సదయహృదయులై, కడుం గడు చిత్రగతుల చెన్నారుచుందురు! కాని, వారి యాంతరంగిక కౌటిల్యము, వారి దుర్హృదయ కాఠిన్యము, వారి దుష్క్రియాపరలోలత్వము, తలఁచుకొన్నచో ఎంత ధీరోదాత్తునకైన, నిలువు నీఱగును! సంతతానంద కరములును, నిరుపమాన మాధురీగరిమనించు మధుర వాణులు, ఒక్కొక మాఱు కొఱ్ఱుఁ గాల్చిఁ చెవిఁలోఁ గ్రుచ్చినట్లు పల్కు ఘోర క్రూరత్వమునకుఁ బొల్పుడు కాల సర్పము లగుదురు! ముందు వెనుకల నరయలేరు; మంచి చెడ్డల నెంచఁబోరు! ఎంచఁ జూడరు! సుదతీమణుల హృదయములు, నవనీత సదృశము లఁట! నవనీతము గాదు; సానదీసి, నిగ్గుదేరిన నవఖడ్గసదృశములు! అబలలఁట, అతినలు! అద్వితీయ బలోపేతులగు వీరాధి వీరుల, మాటమాత్రముచే, దృగంచలమాత్రముచే దండ ప్రణామానులం జేసి, బుగ్గిచేయు మదవతులు, దుష్క్రి

యాపరమతులు, సర్వభేద కారిణులనుట, మానసమా నీకు తెలియని విషయమా? ఏల యీ రీతి చింతఁ దూలె దవు? ఊఁటడిల్లు మూటడిల్లుము! ఈ నాఁటికైన స్త్రీల త్రోవల నెఱుంగుము.

(ఇటు నటు విలోకించి) అన్నా! ఇంకను రాకున్నాఁడవే! రమన్నా, అయ్యో! రాకున్నవాఁడు! కనుమేర దూర మున నెందును గాన రాకున్నాఁడు. లేదు, లేదు. వచ్చు చునే యుండును! (సీత లోనికి నిష్క్రమించును.) అకటా! ఇఁక నేను పోవకుండునేని అనుమానము హెచ్చును. కావున నే నిందుండఁ జనదు. పోయెదను. కటకటా! ఈ తల్లి యొంటియై యుండుట తటస్థించునే! హా! ఈ ఘోరకాననమున నీయమ్మ ఒక్కతెయై యుండఁగలదా? హా! వనానులార, మృగములార, పక్షులార, తరువులారా! మీరైన ఈ తల్లికిఁ దోడై కాపాడుచుండరే.

సీ. శ్రీరామచంద్రుని • ప్రియసతిఁ బ్రోవరె
కృపఁబూని వనవాస • తపసులార!
భూదేవిసుతను సీ • తాదేవిఁ గావరె
భక్తిమై మీరలో • పాంథులార
దశరథుకోడ లీ • తరుణి రక్షింపరె
ప్రీతితోడుగ పక్షి • జాతులార
జనకుని భాగ్యంపు • తనయఁ గాపాడరె
కరుణమై యటవీమృ • గంబులార

గీ. అఖిల భువనైక • మాత ద • యాసమేత
సద్గుణవ్రాత నిర్మల • స్వాంతపూత

నీసతీ సీతఁ గ్రోవరె • యొంటిమి మీర
పంచభూతంబులార ది • క్పాలురార !

(నిష్క్రమించును)

(తెరలో—నారాయణ ! నారాయణ !)

[ప్రవేశము: రావణుఁడు మునివేషధారియై]

రావ—(తనలో) ఇఁక నా కార్యమును సాధించెదను. ఇప్పు డిట్లు నిష్క్రమించిన వాఁడే లక్ష్మణుఁడై యుండును. రాముఁడు మారీచుని వెన్నాడి పోవుచుండుటఁ గాంచితి. కావున నితఁడు లక్ష్మణుఁ డగుట నిస్సందేహము. సీత యేకతమ నుండుటయు సంభవించినది. ఇఁక నాపనిఁ గావించెదను. (బిగ్గఱగ) నారాయణ ! నారాయణ !

(సీత వెలుపలికివచ్చి)

సీత—ఏదో చప్పుడు వినవచ్చుచున్నది. పాదరక్షల శబ్దము వలె నున్నది. (చూచి) ఎవ్వరో మునీంద్రులు వచ్చు చున్నట్లున్నది.

రావ—నారాయణ! నారాయణ (అని జపమాలఁ ద్రిప్పు చుండును.)

సీత—ఋషిచంద్రా ! నమస్కారములు.

రావ—మానవతీమణీ ! దీర్ఘసుమంగలీభవ. దీర్ఘాయురస్తు.

సీత—మునికులతిలకా ! మిమ్ముఁబోలు పూజ్యులను జూచి చాలకాలమైనది. ఎంతయు ధన్యులము ! మా కుటీరము పావనమైనది. తాపసముఖ్యా ! పీఠము దెచ్చెదను.

(నిష్క్రమించును)

రావ—(తనలో) ఔరా! నేఁడుగా ధన్యుఁడనైతిని! ఈ నాఁడుగదా హృదయమున సంతృప్తిఁ జెందఁగల్గితిని. ఆహా! ఇట్టి జగదేకమోహిని, ఇట్టి రాకేందువదన ఎందైనఁ గలదే. నా రాజ్యమున నేల? ముల్లోకములందును గల కాంతలలో ఈ కాంతామణినిఁ బోలువారుందురే?

ఉ. చూచితి పార్వతీ సతినిఁ • జూచితి లక్ష్మినిఁ భారతిన్ రతిన్
జూచితి నాళచిన్ భువన • సుందరులౌ సురసాధ్య కాంతలన్
జూచితి దేవ భోగినులఁ • జూడ్కికి విందగు రీతిఁగాని, నేఁ
జూచి యెఱుంగ నెందును • సుందరి సీతను బోలు నాతినిన్!

ఈ విషయమున నా సోదరీమణి యెంతనాయ మొనర్చినది! ఈ కాంత నిక్కముగ నా రాజ్య మేలఁగలదు.

(సీత పునఃప్రవేశము)

రావ—[సీత పీఠము వేయఁగా కూర్చుండఁబోవుచు] అమ్మా! భీకరతర మృగవ్రాతమునకాకరమైన ఈ ఘోరారణ్యమున నీ రీతి ఒంటిపాటున నుంటివేల? కళ్యాణీ నీ వెవ్వరవు?

సీత—తాపసోత్తమా!

ఆ. వె. జనకరాజుతండ్రి, • ఘనయశుండగు దశ
రథుఁడు మామ; మఱఁది • లక్ష్మణుండు,
భూనయశుఁడు ధవుఁడు • శ్రీ రామచంద్రుండు,
నన్ను సీతయండ్రు • నయచరిత్ర.

మా చరిత్రము సాంగముగఁ దెల్పెదను వినుఁడు.

రావ—కాంతామణీ! నీ చరిత్రము వినుట కిప్పుడు ప్రొద్దు లేదు. నా వింత చరిత్రమును వినుము. వినెదవా? (అని చేతిలోని మాలను విసరివైచును.)

సీత—(చూచి భయముఁ జెందును.)

రావ—కోమ్మా!

గీ. బ్రహ్మమానసపుత్రుఁడై • వరలు విశ్ర
వసుని సుతుఁడను, రాక్షసే • శ్వరుఁడ; నాదు
నిజపురము లంక, యొసలేని • భుజబలుండ,
రావణుం డను పేరఁ బ • రంగువాఁడ.

సీత—(భయముతో) అయ్యో! ఈ క్రూరాత్ముఁ డెందుండి వచ్చెను! అక్కటా! ఏమిచేయుదును! నన్నుఁ గాపాడువా రెవరు! అయ్యో!

రావ—మోహనాంగీ! ఏటికిట్లు భీతిల్లెదవు? నిన్ను మ్రింగను; నిన్ను నిర్దయుఁడనై చంపను. నిన్ను నే ననిశము గాపాడువాఁడను. నీ రూపలావణ్యాతిశయమును మా చెల్లెలు శూర్పణఖవలన విని నీయం దనురాగవశుఁడనై, వివశుఁడనై యింత దూరము నీ చెంతకు వచ్చితిని. మాయామృగరూపమున నిన్ను డాసి వన్నెమీఱిన వాఁడు నా పూర్వామాత్యుఁ డగు మారీచుఁడు. నేను బంపఁగా ఆతఁ డిందున కేగుదెంచి నిన్నొంటిగఁ జేయఁ గల్గినాఁడు. ధాత్రీపుత్రీ! నా చరిత్ర మతిదీర్ఘము. కాలము చాలదు; ముందుఁ జెప్పెదను; రమ్మ పోవుదము.

కాంతా!

తే. గీ. కామరూప ప్రసాదంబుఁ • గలిగియుంట
ఏపుమీరెడు నా నిజ • రూపుఁ జూపి
హీనమానవుఁపై వాశఁ • బోనడంచి
భార్యగా నిన్నుఁ గైకొందు • భాసురాంగి!

లలనాశిరోమణీ! ఇదే నా నిజరూపముఁ జూడుము.

(నిజరూపము చూపును)

సీత— హా! నాథా: (మూర్ఛిల్లును).

రావ—(స్వగత) ఇంక తడవుచేయఁదగదు. శీఘ్రముగ నీ తరుణిని విమానమున నిడికొని వాయువేగమున నిష్క్రమించెదను.

(సీతను విమానముపై వైచుకొని అదృశ్యుఁడగును.)

స ం పూ ర్ణ ము.



ANANDA PRESS, MADRAS.

# మారుతీ గ్రంథమండలి

## ఉరవకొండ

(అనంతపురము జిల్లా)

స్థాపితము : 1935

కార్యనిర్వాహక వర్గము

సంపాదకుఁడు :

మ-రా-శ్రీ యు. గోవిందాచార్యులుగారు.

వ్యవస్థాపకుఁడు :

మ-రా-శ్రీ యు. నారాయణాచార్యులుగారు.

సలహాసంఘ సభ్యులు :

మ-రా-శ్రీ పి. రాఘవేంద్రాచార్యులుగారు,
బి. ఏ., యల్. టి.

మ-రా-శ్రీ కే. వి. సుబ్బారావుగారు,
యల్. యం. పి.

మ-రా-శ్రీ పండిత నూతలపాటి-పేరరాజుగారు.

# నిబంధనలు:

1. ఇందు మూఁడునెలల కొకటిచొప్పున సంవత్సరమునకు నాలుగు గ్రంథము లాంధ్రమున వెలువడును. ప్రతిపుస్తకము క్రౌను సైజు 80—100 పుటలుండును.

2. ఇందు ప్రబంధములు, నాటకములు, కథలు, నవలలు, కవులయు మహాపురుషులయు జీవితములు ప్రచురింపఁబడును.

3. సంవత్సరచందా రెండురూపాయలు. ప్రవేశరుసుము నాలుగు అణాలు. సంవత్సరచందా ముందుగాఁ జెల్లించువారు తపాలాఖర్చులు లేకయే పుస్తకములు పడయఁగలరు. అట్లు చెల్లింపనియెడల మొదటి పుస్తకము వి. పి.గాఁ బంపఁబడును. అప్పుడు సంవత్సరచందా మొత్తము వి. పి. ఖర్చులతోఁగూడఁ జెల్లింపవలయును. అట్లు చెల్లించిన, మిగిలిన 3 పుస్తకములు తపాలాఖర్చులు లేకయే పొందవచ్చును.

4. ఈ గ్రంథమండలి కొక్కతూరి నూటపదునాఱు రూప్యము లొసఁగువారు రాజపోషకులుగ నెన్నఁబడుదురు. ఇందుఁ బ్రచురింపఁబడు ప్రతి గ్రంథమునందును వారి ఛాయాపటములు ముద్రింపఁబడును. గ్రంథమాలా ప్రచురణములన్నియు వారి కుచితముగాఁ బంపఁబడును.

5. ఏఁటేఁటఁ బోషకులు పదిరూప్యములును, అభిమాను లైదురూప్యములును జెల్లింపవలయును. ఇందుఁ బ్రకటింపఁబడు గ్రంథములందు రాజపోషకులయు, పోషకులయు, అభిమానులయు నామములు ముద్రింపఁబడును.

## గ్రంథకర్తలకు సూచనలు:

1. పుస్తకము క్రౌను సైజు 100 పుటలకు మించి యుండరాదు. కాగితమున కొకప్రక్కనే విడిఅక్షరములలో వ్రాయవలయును.

2. ప్రకృతస్థితిలో గ్రంథమండలి, గ్రంథకర్తల నేవిధముగను బహూకరింపఁ జాలదు.

3 పుస్తకమునందు వలసినమార్పు లొనరించుటకు సంపాదకున కధికారము గలదు.

4. పుస్తకము ముద్రణమైన వెంటనే, ఏఁబది ప్రతులు మాత్రము గ్రంథకర్త కుపయోగమునకై పంపఁబడును.

5. ప్రథమ ముద్రణముయొక్క ప్రతులపై గ్రంథకర్త కేలాటి హక్కులు లేవు. ప్రథమ ముద్రణమునఁ బుస్తకము ఐదువందల (500) ప్రతులకంటె నెక్కువగ ముద్రింపఁబడవు. గ్రంథకర్త అనుమతింపనిచో గ్రంథమండలి యా పుస్తకమును ద్వితీయ ముద్రణము చేయరాదు.

6. టెక్స్టుబుక్కు కమిటీవారి యంగీకారముఁ బడసి, యమ్ముడు పోయిన పుస్తకములనుండి వచ్చులాభమునందర్ధము గ్రంథకర్తల కొసఁగఁ బడును

7. కలహంస సంఘసభ్యులు యోగ్యమని తలఁచిన పుస్తకములు మాత్రమే ప్రకటింపఁబడును.

8. పై నిబంధనలందు మార్పు లొనరించుటకు, సంపాదకునకును, కలహంససంఘ సభ్యులకును సంపూర్ణాధికారము గలదు.

అడ్వర్ టైజుమెంటు రేట్లు :

| | పూర్తి పేజీ. | అర్ధ పేజీ. | కాలు పేజీ |
|---|---|---|---|
| | రూ. | రూ. | రూ. |
| 4 పుస్తకములలోఁ ప్రకటించుటకు | 16. | 8. | 4. |
| 3 పు. ప్రకటించుటకు | 12. | 6. | 3. |
| 2 పు. ప్రకటించుటకు | 8. | 4. | 2. |
| 1 పు. ప్రకటించుటకు | 4. | 2. | 1. |

Block insertion and printing will be charged separately.

సంపాదకుఁడు.

# కావలెను

ఆంధ్రజిల్లాలయందలి ప్రధానపట్టణములందు మా గ్రంథమండలికిఁ జందాదారులు, అభిమానులు మొదలగువారిని చేర్చుటకు అనుభవశాలురగు ఏజంట్లు కావలెను. కష్టపడి పనిచేయు వారు నెలకు ఇరువది మొదలు ముప్పదిరూప్యముల వఱకును సంపాదించుకొనవచ్చును. ఏజంటు నూఱు మంది చందాదారులను చేర్పించినయెడల ఇరువదియైదు రూప్యములు పొందవచ్చును. ఏజంట్లుగాఁ బనిచేయఁ గోరువారు ఈ క్రింది విలాసమునకు 0-0-9 స్టాంపుతో దరఖాస్తు పంపుకొనవలెను.

మేనేజరు

మారుతీ గ్రంథమండలి

ఉరవకొండ

(అనంతపురము జిల్లా)

శ్రీరస్తు

# లక్ష్మీబాండ్స్ కార్పొరేషన్ లిమిటెడ్

హెడ్డాఫీసు : లాహోరు

ఒక్కమారు చెల్లింపవలసినది. రూ. 13-8-0 మాత్రమే. ఇందువల్ల కలుగు లాభములు:—

(1) స్వంత పూచీమీద కార్పొరేషనునుండి నూటికి సం॥ నకు రూ. 3 ల వడ్డితో అప్పులను పొందుటకు వీలుండును.

(2) మెంబర్లు యిండ్లు కట్టుకొను నిమిత్తము ఆస్థి తాకట్టుమీద సం॥ నకు 100-కి రూ. 3 వడ్డితో అప్పులను కోరవచ్చును.

(3) మెంబరు లేన యకాలమరణసందర్భమున రూ. 500 ల వరకు మరణసహాయమును పొందవచ్చును.

(4) విద్యార్థులు విద్యావేతనముల పొందవచ్చును. నేడే వివరములకు వ్రాయుడు:—

బ్రాంచి సెక్రటరీ
ది యల్. బి. కార్పొరేషన్ లిమిటెడ్
కల్యాణదుర్గము
(అనంతపురము జిల్లా)

# విజ్ఞప్తి

ఆర్యులారా!

మేము, ఉరవకొండయందలి కోటలో పుస్తకాలయమును నూతనముగా స్థాపించితిమి. మా యొద్ద ఎలిమెంటరీస్కూల్సు, హైస్కూల్సు బాలబాలికలకు గావలసిన వాచకములు, చరిత్రములు, భూగోళములు, లెక్క పుస్తకములు, సైన్సుపుస్తకములు, శతకములు, పెద్ద బాలశిక్షలు, ఎక్సరుసైజు, డ్రాపు మొదలగు నోటుపుస్తకములును, కాగితములు, కలములు, పెన్సిళ్లు, రబ్బర్లు మొదలగు స్టేషనరీ సామానులును, ఉపాధ్యాయులకు గావలసిన అటెండెన్సు, అడ్మిషన్ రిజిస్టర్లును, భాషాభిమానులకు గావలసిన ప్రబంధములు, నాటకములు, నవలలు, జీవితచరిత్రములును, మారుతి గ్రంథమండలి వారి ప్రచురణములును వెలకు దొరకును. సరుకు మంచిది. వెల సరసము. ఒకతూరి కొని చూడుడు.

యు. జి. ఆచార్య్ల అండ్ సన్స్,

బుక్ సెల్లర్స్, అండ్ స్టేషనర్స్,

ఉరవకొండ

(అనంతపురము జిల్లా)

# తృతీయ కుసుమము

(రాఁబోవు గ్రంథము)

# ప్రేమపరిణామము.

కర్త:

సాహిత్యసరస్వతి సీరిపి - ఆంజనేయులుగారు.

ప్రేమమయి, భగవతి మాతృదేవి. పూజ్యుఁడగు పితృదేవుఁడును ప్రేమసుధావిరాజితుఁడే. ప్రేమ, స్వర్ణశృంఖలమై సుహృత్కోటిని బంధించుచుండు. తల్లికిఁ బిల్లయుఁ బిల్లకుఁ దల్లియు నేర్పడుట ప్రేమవలననే. ప్రేమలేని ప్రాణి, రసము లేనివాణి. ప్రేమలేని స్థలము, జీవాణువులేని దేహము. ప్రేమ జగన్మయము. జగన్నాథుఁడును ప్రేమ ప్రపూర్ణుఁడేగదా? పవిత్రవంతమగు నిట్టి ప్రేమతత్త్వ మెవ్వరే నెఱుంగవలదా? మహత్తరమై లోకోత్తరమైన యీ ప్రేమవలని పరిణామ మెట్టిదో తెలిసికొన నాంధ్ర పుత్త్రికలారా! మీ ప్రేమ విలసిత హృదయము లావేగముఁ జెందుచున్నవా? ఔను! నిరంతర ప్రణయారాధకుల కది సహజము. అటులేని 'ప్రేమపరిణామ' మను సుమము సాకల్యముగ నొక్కమాఱు దిలకింపుఁడు. అందలి ప్రేమామృతము నాప్యాయమానముగఁ జూఱలాడుఁడు. అయ్యది నవ్యమగు నవలా పుష్పరాజము. దివ్యతరమైన యితివృత్తదళ విరాజితము సుమనోజ్ఞ నీతిసౌరభ సమన్వితము. కమనీయ రసామృత పూరము.

మన మారుతీ గ్రంథమండలియందలి

తృతీయప్రసూనమే సుండీ!

[1936-వ సం. ఏప్రిల్ నెలలో వెలువడును.]

